## Bibliographic Record Target

కృష్ణకోల్హాట్కర్, శ్రీపాద.

చిత్తవృత్తి : మహారాష్ట్రనాటకమునకు తెలుగు / అనువాదకుడు మాచిరాజు దుర్గాశంకరామాత్యుడు ; పరిష్కర్త శ్రీపాద కామేశ్వరరావు.- రాజమండ్రి : చెఱకువాడ వేంకటరామయ్య, 1927.

180 p. :port. ;20 cm.

Record no. 493

Kṛṣṇakōlhāṭkar, Śrīpāda.

Cittavṛtti : Mahārāṣṭranāṭakamunaku Telugu / anuvādakuḍu Māciraju Durgāśaṅkarāmātyuḍu ; pariṣkarta Śrīpāda Kāmēśvararāvu.- Rājamaṇḍri : Ceṟakuvāḍa Vēṅkaṭarāmayya, 1927.

180 p. :port. ;20 cm.

Record no. 493

# చిత్తవృత్తి



మహారాష్ట్రనాటకమునకు తెలుగు

అనువాదకుడు:

మాదిరాజు దుర్గాశంకరామాత్యుడు

పరిష్కర్త:

శ్రీపాద కామేశ్వరరావు










ప్రకాశకుడు:

చెలుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్ర గ్రంథమాలాకార్యాలయము.

రాజమండ్రి

1927

సర్వస్వామ్యసంకలితము] వెల ఒకరూపాయి.

PRINTED BY

A. LAKSHMANASWAMY NAIDU

at

THE SARASWATHI POWER PRESS,

RAJAHMUNDRY.



మాచిరాజు దుర్గాశంకర రామాత్యుడు

*Block by M. R. Deoskar, Nagpur.* *D S Press Nagpur.*

# పీఠిక

ఈ నాటకమునకు మూలము శ్రీయుత శ్రీపాద కృష్ణకోల్హాట్కర్ మహాశయుడు రచించిన "మతివికార" మనే నాటకము. దీనిని తెలుగు చేసినవారు శ్రీమాన్ మాచిరాజు దుర్గాశంకరామాత్యుడు. వీరిపేర్లు మేము ప్రకటించిన "శివాజీ శీలము" నే నాటకమును చదివిన వారికి సుపరిచితములు. వారిద్దరికీ మా గ్రంథమాల తరఫున అనేక వందనము లాచరిస్తున్నాము.

పై నుదాహరించిన అనువాదమును పరిష్కరించేటప్పుడు కొన్నిచోట్ల మూలము నతిక్రమించినాము; అందుకై మమ్మందరూ క్షమింతురుగాక!

ప్రకాశకుడు.

ఇందలి ముఖ్యపాత్రములు.

పురుషులు.

| | | | |
|---|---|---|---|
| మనోహరరావు | ... | ... | సంఘసంస్కర్త. |
| చకోరరావు | ... | ... | మనోహరుని తమ్ముడు |
| ఆనందరావు | ... | .. | ,, తండ్రిమిత్రుడు |
| విహారరావు | ... | ... | ఆనందరావు కొడుకు |
| హరిహరశాస్త్రి | ... | ... | ఒక దాంభికుడు |

స్త్రీలు

| | | | |
|---|---|---|---|
| సరస్వతి | ... | ... | ఆనందరావు భార్య |
| చంద్రిక | ... | ... | ,, కూతురు |
| తరంగిణి | ... | ... | ,, కోడలు |
| వేణమ్మ | ... | ... | ,, వంటలక్క |




# మొదటి అంకము

---

## మొదటి రంగము...రోడ్డు

మనోహర చకోరులు

మనో—నాయనా, చకోరా, నిన్ను కలుసుకొనడాని కెదురుచూచి చూచి నా కళ్ళు కాయలు కాచినవి. నిన్ను చూడవలెనని నా యాత్మ పడ్డ ఆతురత ఎంతని వర్ణింతును? నీతోడి ప్రవాసులందరూ వారి యాప్తులనూ మిత్రులనూ చూడవలెనని ఓడపైభాగమున పట్టుమీది తేనెటీగలవలె మూగినా నేను నిన్ను త్వరలో పోల్చుకొని ఏకాగ్రదృష్టిని నీవైపే చూస్తూంటిని. ఇప్పుడు కరవుతీర నిన్ను చూచి గాఢాలింగనము చేయగల్గిన నా ఆనందమునకు మేరలేదు. నా అవయవము లన్నీ నీ స్పర్శసుఖము నపేక్షిస్తూండెను కాని, తీగా చెంతజేరిన తరువాత కళ్లకరవు తీరిందని తక్కినవాటికి స్పర్ధ జనించెను. ఇది చూడగా ఇహము దుఃఖమిశ్రితము కాని సుఖ ముండదని తేలబడుతూన్నది.

చకో—నేటివరకూ మీ సందర్శన ముత్తరములమూలముననే జరుగుతూండెను. అందుచేత మిమ్మెప్పుడు చూడగల్గుదునా అని నా మనస్సు కలవరపడుతూండెను. నేడు మిమ్ము కలుసుకోవడము నా భాగ్యవశముననే కదా?

మనో—తమ్ముడా, నాన్నగారు తాము పరలోకప్రాప్తి చెందేటప్పుడు నిన్ను నా కప్పగించి వీనికి శైశవమున తండ్రివలెను తారుణ్యమున మిత్రునివలె వర్తింపుమని నొక్కి చెప్పిరి. నేడు నీవు పెద్దవాడవై విద్యాసంపన్నుడ వైనది చూస్తే వా రెంత సంతసించియుందురో?

చకో—అన్నయ్యా, నాన్నగారు లేని లోటు కనబడకుండా మీరు నన్ను పెంచి పెద్దచేసినారు. మీ పాలనము వల్లనే నే డింతవరకూ రాగల్గితిని. లోకమండలి సోదరులవంటి వారు కారు మీరు; మీ మేలు నేను మరువలేను, ఋణము తీర్చలేను.

మనో—నాయనా, అది నీ సౌజన్యమునకు ప్రతిఫలము. నేను జేసినది నా విధి; దాని నంతగా ప్రశంసింపజనదు... ఇప్పటికే జాలమైనది; మనయింటికి పోవడమునకు వ్యవధిలేదు కావున దగ్గరనే ఒక మిత్రునియింట కొంత సేదతీర్చుకొని పిమ్మట మనయింటికి పోదాము.

చకో—అన్నయ్యా, స్వతంత్రదేశములని మిడిసిపడుతూన్న జపానాంగ్లేయదేశములకంటె పారతంత్ర్యమున చిక్కుకొన్న మన భారతభూమే నా కమితానందము చేకూర్చింది.



మనో—ఇది సహజమే. ఒక వేదరాలిసుతుని శ్రీమంతుని భార్య ఎత్తుకొని ముద్దుబెట్టుకుంటూన్నా ఆ బాలుడు తన తల్లిదగ్గరకే పోవయత్నించును కదా? సరిగశాలువలు, రత్నాభరణములున్నా వానికి సుఖము చేకూర్చగలవా?

చకో—అన్నయ్యా! మన అనాథశరణాలయ మిక్కడికి సమీపముననే యుండవలెను. అ దభివృద్ధిలో నున్నదా?

మనో—నాయనా, దినదినాభివృద్ధి గాంచుతూన్న మన దురాచారములకు తోడు ప్రతివత్సరమూ మనదేశమున మహామారి, విశూచి మొదలయిన రోగములు పెరుగుతూన్న కొలది అనాథల సంఖ్య హెచ్చుతూనే ఉంది. శరణాలయము లభివృద్ధిచెందడ మొకవింతా? (చింతాకులుడై యుండును) ఇప్పుడు మన యాశ్రమమున నూర్గురుకన్న ఎక్కువే వితంతువు లున్నారు.

చకో—అదేమో కాని అన్నయ్య మొగము మొదటినుంచీ వాడియున్నది. దీనికి హేతువేమో? (ప్రకాశముగా) అన్నయ్యా, మనవా రందరూ సుఖముగా నున్నారా?

మనో—చంద్రిక వృత్తాంతము వీని కెట్లు తెల్పుదును? (ప్రకా) తమ్ముడా, విపత్సముద్రమున నోలలాడుతూన్న మన దేశముపై దౌర్భాగ్యదేవత తాండవ మాడుతూండ మనకు సౌఖ్య మెక్కడిది? ప్రజల దారిద్ర్య మంతకంతకూ హెచ్చుతూండుటచేత శరీరములు బలహీనములవుతూన్నవి; పారతంత్ర్యము ప్రబలుటచేత దుర్గుణములు

వ్యాపిస్తూన్నవి, మానసములం దౌదార్యము హీనమవుతూన్నది. మనకన్న బలవంతులయెడ ప్రాథేయత చూపించి మన క్రిందివారియెడ అహంకారము బూని మెత్తనివారిని మొత్తుతూన్నాము. సభలయందు స్వాతంత్ర్యమునకు పోరుతూ మనస్త్రీలయెడ దురాచారముల నవలంబిస్తూన్నాము. వీరికి మనము దయజూపము కాని ఇతరులను "మాయెడ కృప వహించండ''ని మొరవెట్టుతూన్నాము. ఎంత సిగ్గుమాలిన వారమైనాము! సంఘసంస్కర్తలని పేరుపెట్టుకొని విదేశీయుల దురాచారముల నవలంబించేవారు కొందరు, సనాతనధర్మావిష్టులమని అతిబాల్యవివాహములు చేసేవారు కొందరు ; పంచమహాపాతకము లొనర్చినా పరమగౌరవమునకు పాత్రులైనవారు కొందరు ; పిరికితనము సారాసారవిచార మనిన్నీ మూర్ఖపుపట్టుదల ఉత్కృష్టప్రవృత్తి యనీ ఎంచేవాళ్ళు కొందరు...ఇట్లు దేశమంతా అల్లకల్లోలముగా నుండగా సౌఖ్య మెట్లలవడగలదు?

చకో—పోనీ—శారీరక మాత్రముననైనా మనవారందరికీ కుశలమా?

మనో—సోదరా, మానవు డెప్పుడూ స్వార్థమునే కోరును. సంఘము బలిష్ఠమైతే అతని దురాచారములు సాగనీయదు; సంఘబలము తగ్గినదా ఇక వ్యక్తులవెర్రికి అడ్డుండదు. కొందరు సనాతనధర్మముల నుల్లంఘించవలసి వచ్చినప్పుడు సంఘసంస్కర్తలలో చేరుతారు; సంస్కారము లాభదాయకము కాకుంటే సనాతనధర్మపరులలో చేరుతారు. ఏయెండ కాగొడుగు పట్టి తమకార్యము నిర్వహించుకొంటారు. మన ఆనందరావుపంతులుగారు ఈమధ్య పునర్వివాహము చేసుకొన్నారు.



చకో—గతభర్తృకనేనా?

మనో—ఏమి వారి ప్రారబ్ధము? పదిహేనుసంవత్సరముల కన్య దొరకినప్పుడు నిష్కారణముగా కులము చెడగొట్టుకొంటారా?

ఇతరులకు చెప్పవలసినప్పు డట్లే చేయుమందురు... ఆతని వయస్సు ఏబదేళ్ళు, చెట్టంతకొడుకూ—పదిహేనేళ్ళ కూతుగూ...

చకో—వారిద్దరూ క్షేమముగా నున్నారా?

మనో—చకోరా, వారికి సేమమే కాని చంద్రికకు మాత్రము తగనిసంకటము ప్రాప్తించినది.

చకో—ఆమె వ్యాధిగ్రస్తురా లయినదా?

మనో—అట్లయిన మేలే.

చకో—అంతకన్న ఘోరతరమైన సంకట మెట్టిది?

మనో—ఆమెకు వైధవ్యము ప్రాప్తించి...

చకో—పెళ్లెప్పు డయినది?

మనో—ఆమె దశ కడు శోచనీయము. ఆనందరావు చేసుకోదలచిన పిల్ల కొక పినతండ్రి యుండెను. తనకూతురి నాతని కిచ్చి ఆతని అన్నకూతురిని తాను చేసుకొన్నాడు!

పెళ్లియైన కొద్దికాలములోనే ఆతడు పరలోకగతుడాయెను.

చకో—అన్నా! చంద్రిక కెంతకష్టము ప్రాప్తించింది! అయ్యో! అయ్యో! ఆనందరావుగారు మన తండ్రిగారికి ప్రాణమిత్రులు. వారి వాత్సల్యము కేవలమూ మాటలయందే కాక కార్యరూపమున పరిణమించచేయవలెనని ఏమేమో బాసలు చేసుకొనడమే కాక బంధుకుటుంబములలో నెల్ల చాటి లేనిపోని యాశలు కల్గించిరి, చంద్రిక నావంతుకు వచ్చినది. ఇదంతా మీ రెరుగుదురే, దాని వివాహము నిశ్చితమైనప్పుడు నాకు కొంచెము తెల్పరాదా.

మనో—అసలీవివాహమయ్యేదాకా మాకే తెలియలేదు. ఎరితో రహస్యముగా జరిపించవలెనని ఆనందరావుగారు యత్నించి ఒక లగ్నమందే రెండు పెళ్లిళ్లూ కానిచ్చినారు. ముడి పడ్డతరువాత ఎవ రేమి చేయగలరు?

చకో—విహారు డేలాగు సమ్మతించినాడు?

మనో—వానికీ తెలుసునో లేదో? చంద్రికను నీకివ్వడము వానికి గిట్టదు; అందుచేత ఒప్పుకొన్నాడేమో?

చకో—నా కివ్వకుంటే పోనీ, కాటికి కాలుచాచిన వానికి కట్టపెట్టినారే?

మనో—అత డింతలో అంతమొందునని ఎంచలేదు కాబోలు.

చకో—ఆనందరావుగారు వివేకవంతులు కదా ఇంతి దురంతముల కెట్లు సమ్మతించినారో ఊహించలేకున్నాను.



మనో—ఇందో రహస్యముంది. ఈమధ్య హరిహరశాస్త్రి అనే దాంభికు డొక డాతని నాశ్రయించినాడు, వాడు దేవాంతకుడు; ఎట్టి ఘోరకార్యమునైనా జంకులేక నిర్వహించగలడు. ఆనందరావు వివాహసన్నాహ మాతని కుతంత్రము, చంద్రికావివాహమూ వాని పన్నాగమే. స్వార్థపరుల కేది సాధ్యముకాదు?

చకో—అయ్యో! అయ్యో! ఇక చంద్రికి మొగమేలాగు చూడగలను?

మనో—ఆమెపతి గతించినపిమ్మట ఆనందరావుగారిని పరామర్శింపబోవునప్పుడు అందరామెకు వపనము చేయించవలసినదని తన్ను నిర్బంధిస్తున్నారనీ తానే అందుకు సమ్మతింపలేకనీ పంతులుగారు నాతో చెప్పినారు.

చకో—ఇక చంద్రిక కచ్చట దిక్కులేదు. అన్నగారు పూర్వాచారపరాయణుడు, తండ్రిగారు మొన్నటిదాకా సంస్కరణముపైని వాచావాత్సల్యము చూపించేవారు కాని ఈవివాహములతో ఆరవ్వంత అభిమానమూ అంతరించినది. ఇక దాని కేమిగతి? మనము పూనుకోకపోతే దానిబ్రతుకు నరకయాతన కాక తప్పదు.

మనో—తండ్రియనుమతి లేకుండా ఆమెను చూడరాదు, చూడ వీలూ లేదు. నే డాతనిని కలిసి మొగ్గకనిపెట్టి అనంతర మామెను చూచేయత్నము చేతాము. ఇప్పుడు మనము "శరణాలయమునకు పోయి ముందుచర్య

నిర్ణయింతాము.

చకో—పెద్దలు, మీ మాట కాదందునా?

(వెళ్లుదురు)

---

—౹౹ రెండోరంగము ఆనందరావిల్లు ౹౹—

ఆనందరావు—సరస్వతి.

ఆనంద—ఏమి నీ నగలశోభ! సర్పాకారమైన నీ జడను గులాబీపుష్పములూ, మొగలిపువ్వులూ, మొదలైనవి కప్పివేసినవి. తోటలలో పూలమీద సర్పము లుండును, నీజడలో సర్పముమీద పువ్వులున్నవి. ఈ పాపటబిందీలు, చంపసరములు, నత్తు, బావిలీలు, బొగడలూ, దుద్దులూ మొదలయినవాటి కాంతిచేత నీముఖచంద్రుని కాంతి హెచ్చింది. అడ్డిగెలు, సాహా, గజ్జెలపట్టెడ, కంటె కాసులదండ మెడలో మెరుస్తూన్నది. భుజములకు దండకడియము, గజ్జెలభుజబంధు, రవలవంకీలున్నూ వన్నె తెస్తూన్నవి. ఇన్ని నగలు మోయడానికి స్త్రీలకే చెల్లింది. భర్తలను వారు లొంగతీసుకోగా నగలు వాళ్ళని లొంగతీస్తున్నవి. ఇవి మాకు గర్భశత్రువులు; మావల్లపుట్టి, మావల్ల పెరిగి మా కమితప్రీతిదాయకమైన మీ గాత్రస్పర్శసుఖము లేకుండా చేస్తూన్నవి.

సర—నగలమీది వ్యామోహము కేవలము మాకే కాక మీకు కూడా కొంతవరకూ కలదు. వేళ్ళకుంగరాలు,



చేతులకు గొలుసు, కడియములు, చెవులకు కమ్మలు వాచీ గొలుసు, సులోచనములూ మీకుమాత్ర మాభరణములు కావా? ఇదిగాక మా విడంబన మింటిలోనే, మీరు వీధెక్కుతారు.

ఆనంద—పేరు కొకటో రెండో మా నగలు, మీకో ఒక్క గాజులజతలే పదిహేను రకాలు, చెవులకు జిల్లాలు, తాల్లూకాలు. ఇంకా...చరాచరజగ మంతా మీరు తనుగతము చేసుకొంటున్నారు. మేము ధరించేవి ఆభరణములే కావు. అదీకాక మీ నగలు మీ శరీరలోపములను కప్పిపుచ్చును, మేము ధరించేవి మా లోపములను బైటపెట్టును. ఇంకొకటి మన దేశములోని సొమ్ము నగపాలు నగలక్రింద వ్రయపడుతూన్నది. ఈ తృష్ణ మాని దేశోపకారకములైన కర్మాగారములు, వర్తకపుసామగ్రియందూ సొమ్ము వెచ్చించినట్టయితే ధన మభివృద్ధి చెందును, తద్వారా దేశమూ బాగుపడును. మీ ఆభరణములన్నీ స్వదేశమును కొల్లగొట్టి విదేశములను బాగుచేస్తూన్నవి.

సర—మీ రుపయోగించే. సారా స్వదేశపోషకమా? నగలుమాత్ర మిక్కడివారే చేయులేరా?

ఆనంద—అన్నా, నా వేలితో నాకన్ను పొడిచింది. నేను కేవల మారోగ్యముకొరకే పుచ్చుకుంటున్నానని ఎరుగదు, చెప్పితే నమ్మదు. (పైకి) నగలు పెట్టుకోరా దనను, పండుగా పర్వమూ వచ్చినప్పుడుపయోగిస్తూంటే అరుగుదల

హెచ్చుండదు.

సర—ఐదోతన మున్న నాలుగురోజులేనా వీటిని ధరించకపోతే ఇక నున్న దేమిటి? నెత్తిమీద కొంగు వచ్చిన వెనుక నగలుండి ప్రయోజనమేమి?

ఆనం—అదిగో, నీకు కోపమువచ్చినట్లుంది-ఇంకా ప్రశంస తేబోను. నీ ముచ్చట తీర్చుకో, నే వద్దనను.

సర—అందరి యాడవారివలె నేను పట్టు పట్టనేలేదు-మెత్తనిదానను కావుననే మీచిత్తము వచ్చినట్లు నడుస్తూంది.

ఆనం—నీవు గుణవంతురాలవే-అప్పుడప్పుడు తిక్క పట్టుతూంటుంది, ఒకంతట తిరుగదు.

సర—మొన్న పేరంటముకు మనయింటికి ఒకావిడె వచ్చింది-ఆమె మెళ్ళో చంద్రహార ముంది, దాని చక్కదనము ఎంతని చెప్పను-ఎంత నిండైన సరుకు-అది లేకుంటే నామెడ బోసిగా నుంటుంది-అది చూపించనా?

ఆనం—ఏదో మనసులో నుంది-నీమెడ బోసిమెడ అని ఎవ రన్నారు?

సర—ఆవస్తువు మీరు చూస్తే తప్పకుండా చేయిస్తారని నాకు గట్టినమ్మక ముంది- అబ్బా, మిలమిలలాడుతూ, తళతళ మెరుస్తూ ఎంతో చులకన, ఏమి నాజూకుగా ఉందని చెప్పను! చూడవలెను కాని దాని అందము నోటితో చెప్పలేము.

ఆనం—మిరియాలపేరు గావలెనని కిందటినెల ప్రా



ణాలు తీసినావు-ఇప్పు డీ దొకటా? రే పేమిటో?

సర—అలాగు కాదు-చంద్రహారము చేయిస్తానంటే ఇప్పుడల్లా మిమ్ము బాధపెట్టను. అది చూచినప్పటినుంచీ మరుపునకు రాకున్నది.

ఆనం—చంద్రహారము లేకుంటే అన్నపుముద్ద దిగదా?

సర—దిగుతుంది కాని ఒంట పట్టదు.

ఆనం—ఇలాగే నాప్రాణాలు కొరికి సొమ్మంతా నగలుగా మార్చితే ఎప్పుడో ఒకనాడు దొంగ లింట్లోపడి నిలువుదోపు చేస్తారు-అప్పటికీ సరదా తీరుతుంది-

సర—అలాగా? అదొంగ నగలను విడిచి నన్నే అపహరిస్తే అసలుకే మోసము వస్తుందే?

ఆనం—అబ్బ, శృతి మించుతూన్నది-ఇదిగో చంద్రహారము నేడే పురమాయిస్తాను-ఇంకేమైనా ఉంటే ఇప్పుడే చెప్పు, కూలియైనా కలిసివస్తుంది-

సర—ఇంక నాకే మక్కరలేదు, ఇక మీ యిష్టము; అంతమా టన్నా రదే చాలును...చూచినారా, మీకు సుఖమూ ఖ్యాతీ చేకూరడమునకే నే నీనగలు కోరినాను-

ఆనం—నాకు నగలంటే నచ్చదని ఎన్నిసార్లు చెప్పలేదు?

పర—ముచ్చట లన్నీ వీగినతరువాత మొగము మొత్తడము సహజమే. నేనూ పెద్దదాన నయితే నాకూ

వెగటు పుట్టుతుంది నగలమీద.

ఆనంద—ఆమా టెందుకు? చంద్రహారమునకు తోడు కుందనపు పతకము కూడా చేయిస్తాను; తృప్తియైనదా?

సర—నే నెంత మంచిగా నడుచుకొన్నా మాట దక్కనివ్వరు. మీ పాదసేవతప్ప ఇతరకార్యములు నాకే మున్నవి? నాలుగురోజులనుండి ఈ పాడువంట నానెత్తిపై బడినది, చావడానికేనా తెరపి లేకుండా ఉన్నది. వంట బ్రాహ్మణుడు కుదురలేదు. చంద్రికదొరసానిగారిచేతి వంట దేవతార్చనకు పనికిరాదు. ఈ రెండిట్లో ఏదైనా కలిసివస్తే మిమ్ము వదలి క్షణమైనా ఉండకపోవుదును.

ఆనంద—ఇదిగో, చంద్రికా నీ యీడుదే. దానికి నగలముచ్చట లేనే లేదు. జుట్టు దానితో పుట్టిన అలంకారము; దానినికూడా తీసివేస్తే పాపము దానిమన సెంతో తహతహ పడుతుంది. లేకలేక కల్గిన కూతురు.

సర—ఈజగత్తులో ఆమె యొక్కర్తే కూతురా? ఈయవస్థ దానికే వచ్చినదా? ఆమె నాలా గుంచడమువల్ల నలుగురిలో ఎంత తలవంపులో మగవారి కేమి తెలుస్తుంది, బాధపడే మాకుగాని? ఇ దెన్నాళ్ళో! అనుభవించితీరవలెను. ఎంత సొమ్ముం టేనేమి? సుఖపడడానికి నోచుకోవలెను. నుదుటివ్రాత ..

అనం—మునుపటి బ్రాహ్మణుడు మానుకొన్నప్పటి నుండీ నేను ప్రయత్నము చేస్తూనేయున్నాను. మగవాడు



లేదు సరేకదా ఆడదేనా దొరకలేదు.

సర—ఎందుకూ? ఏమేనా అంటే మీకు కోపము వస్తుంది కాని మీ సంఘసంస్కర్తలు మారుమనువు పెళ్ళిళ్లు మొదలుపెట్టినప్పటినుంచీ వంటలక్కలకు గిరాకీ వచ్చింది.

ఆనంద—వంటబ్రాహ్మణుల కెంత పొగరెక్కింది? వాళ్ల టెక్కులు, వాళ్ళ వేషాలు, ఆషోకులు చూచితీరవలెను.

సర—వాళ్ళచేత మీరు మాంసము వండించవలెనంటే వాళ్ళకి షోకులుండకేమి?

ఆనం—నే నట్లు చేసేవాడను కానే?

సర—అదేమో? వాడే నాతో చెప్పినాడు. అలాటి వంటలు కావలిస్తే ఇరవైరూపాయిలు కావలె నన్నాడట?

ఆనంద—పోకిరీగాడిదెకొడుకు! ఏదీ, నాయెదుటికి రానీ, చెప్పుదెబ్బలు కొట్టుతాను...ఇదిగో శాస్త్రిగారితో చెప్పినాను, మూడునాలుగురోజులలో నెవరినో తీసుకొని వస్తా నన్నారు. అందాకా నీకీశ్రమ తప్పదు. అతను తేలేకపోతే ఇంకో స్నేహితునికి వ్రాసి ఎంతకైనా కుదురుస్తాను. నీ కోసమే నేనెంత పాకులాడుతూన్నానో చూచినావా?

సర—నేను మాత్రము మీయెడల ఉదాసీననై యున్నానా?

ఆనం—ఉదాసీనవనికాదు; నాప్రేమకు సరియైన మారుప్రేమ నీయం దింకా కుదురుపడలేదు. అది యభ్యా

సము మూలాన కాని చేకూరదు. స్త్రీధర్మములు ప్రతిపాదించు ప్రబంధము నీకిచ్చినాను. దానిని చదివినావా ?

సర — అయ్యోబాబో! చాలా క్లిష్టముగానున్నది. నవలలు నాటకములలో భాషవలె కాక ఆభాష చాలా కఠినముగా నున్నది. రెండు మూడు పేజీలు చదివినాను, బోధపడక పోవడముచేత నిద్ర వచ్చింది. అప్పటినుంచీ నిద్ర రావలెనంటే ఆపుస్తకము చదువుతాను.

ఆనం — పాడుభాషలో వ్రాస్తే నీకింపుగా నుంటుంది కాబోలు. ఇప్పుడు భాషాసంస్కర్తలు రెక్కపురుగులవలె లేచి ఎవరియిష్టమువచ్చినట్లు వారు వ్రాస్తూన్నారు. ఒక సూత్రము కాదు, ఒక శైలి కాదు- ఇవి చదివి యిప్పటి వారందరూ వెనుకటి గ్రంథములను వెనుకకు నెట్టుతూన్నారు; మిడిమిడిజ్ఞానము కల మీకవి రుచించకుండా ఉన్నవి.

సర — మీకు రుచించేవి నాకు రుచించవు, నాకు రుచించేవి మీకు రుచించవు; ఇదంతా వయోభేదమువల్ల కలిగిన వైషమ్యము. మీరు నన్నుకాక వయసుమీరిన ప్రౌఢవితంతువును పెళ్ళియాడితే అన్నివిషయములా మీకిద్దరికీ సామంజస్యము చేకూరియుండును.

ఆనంద — దెప్పడము నీకు బాగా చేతనవును. ఇది విను —

మృదుమధురపదభూయిష్టంబై ఉత్తమధర్మప్రతిపాదకంబైన ఉపాఖ్యానము వినవలతుమన్న శౌనకాదిమహామునులతో సూతుం డిట్లనియె:—



దీనుండైనను తనపతి
హీనుడు వ్యసనియు దయావిహీనుండైనన్
వానినె దైవమటంచును
తా నెంచి చరించు సతియె ధరలో సతియా॥

వినుండు శర్యాతి యను రాజన్యునకు కన్యాతిలకంబగు సుమతి యను నొక కూతురు కలదు—

సుమతివివాహమునాటికి
సుమశరసము డామెభర్త శుభతనుడై పా
పము పదపడి యాతని దే
హాము ఘోరపు కుష్ఠరుజకు నాశ్రయమయ్యెన్॥
సృక్కిన యంగుళములు దళ
మెక్కిన దేహమును కాంతియెడలిన **మొగ**మున్
స్రుక్కిన చెవులును ముడిగిన
ముక్కునునై నేహ్యమయ్యె బో తనువెల్లన్॥

ఇట్లు దుర్భరంబును దుర్నిరీక్ష్యంబును నయిన రోగంబుచే దనపతి పీడితుండౌట పూర్వజన్మకృతమని నిశ్చయించి సాధ్వీలలామంబగు నా సుమతి ప్రారబ్ధ మవశ్యానుభవంబని యెంచి,

దుష్టరక్తంబున దూషితమైన వ
స్త్రంబులనుతుకు నసహ్యపడక,
కడిగి వ్రణంబులు కట్లు పట్లును వేసి
ఎంతయు సేవించు నేవపడక,

దుర్గంధతనుఁడంచు తొలగియుండక రేలు
పతిసెజ్జ పవళించు కుతుకము సఖ,
అతిహేయమయినట్టి యతని యుచ్ఛిష్టంబె
మెసవు నేప్రొద్దు సంప్రీతిమెరయ,
నింతయేటికి వాక్కున స్వాంతమునను
కర్మయందును విముఖత గనక సుంత
పతినె దైవంబుగా నమ్మి పరమభక్తి
సేవజేయుచునుండె విశిష్టమతిని॥

ఓహో! దీనికి హితోపదేశమంటే నిలువరాని నిద్ర. ఇక్క డాపివేయవలెను. ప్రేయసీ, లే, లెమ్మ.

సర—ఆహా! ఎంత వింతకల గంటిని!...మన ముభయులమూ ముచ్చటలాడుకొంటూ రథమెక్కి వియన్మార్గమున పోతూంటిమట—అప్పు డొకచక్ర మూడిపడగా ఒక పురుషుడు దానిని సరిజేసి భద్రముగా రథమునకు కూర్చగా అది యథాప్రకారము నడచిపోయెనట—ఎంతో నిజముగా నుంది. (మనోహరుడు వచ్చును)

ఆనంద—నేనిందాకా రథము గురించి చెప్పియుంటిని, అదే నీకలలో వచ్చియుండును....ఒహో! మనోహరరావూ, లోనికి రా! (సరస్వతితో) ఈతడు మన తరంగిణికి పినతల్లి కొడుకు—ఈయూరి అనాథశరణాలయమునకు స్థాపకుడు, మనోహరరావూ, ఈమెయే నా ద్వితీయ కళత్రము.

మనో—మీ పరస్పరానురాగము శుక్లపక్షచంద్రుని



వలె దినదినాభివృద్ధి గాంచి మీ దాంపత్యము రోహిణీసుధాకరదాంపత్యము వలె అనుకూలించును గాక!

సర—(తలవంచి) నేటివరకూ మీయౌదార్యమూ కీర్తిని గురించి వినడమే కాని మిమ్ము ప్రత్యక్షముగా చూచే భాగ్య మబ్బలేదు; నేడు సుదినము, మహాత్ముల సందర్శనము సమకూరింది.

మనో—న న్నంత గొప్ప చేయవలదు—నేను సర్వసామాన్యుడను.

ఆనంద—మహాత్ములయందు వశీకరణశక్తి యుంటుందంటారు, అది యసత్యము కాదు. ఎరుగనివారికి కూడా వారియెడ అనురాగోదయ మవుతుంది.

మనో—సంసారబంధములు లేని నాబోటివాడు ధనమును సద్వ్యయముచేస్తే అందు కొనియాడవలసినదేముంది?

స్వ—ఆబంధములు తెంచుట సామాన్యుల కలవియగునా? నిండు జవ్వనమున భార్య గతిస్తే బ్రహ్మచర్యము నాచరించేపాటి మనోధైర్య ముండడము సామాన్యమా?

మనో—ప్రేమవితరణమునకు వివాహ మొక్కటే మార్గమా? మనవారని ప్రత్యేకముగా కొందరు లేనప్పుడు ప్రపంచమంతా ప్రేమభాజన మవును. ప్రేమార్హు లెందరు లేరు మన దేశమున?

ఆనంద—మనోహరరావూ, చాలాకాలమునకు వచ్చి

నావు. నేడు మాయింట భోజనము చేయవలెను సుమా.

సర—జరుగురుపని ఉంటేతప్ప ఆగవలెననే మా ప్రార్థన.

ఆనంద—తొందరపని కేమిలే. నామాట తోసి వేయడు.

మనో—మీమాట నేను గడవజాలను.

(సరస్వతి లోని కేగును)

ఆనంద—(స్వ) సరస్వతికి విద్య నేర్పడములో నే నిప్పటివరకూ శ్రద్ధ వహించలేదు. మొన్ననే శాస్త్రిగారిని పురాణము చెప్పడానికి నియమించినాను. దానికితోడు సంస్కారవాసన కూడా కలిగించడ మత్యావశ్యకము. అందుచేత మనోహరరావు నందుకు నియోగిస్తే ఆమె బుద్ధి త్వరలోనే వికసించగలదు. సనాతనధర్మమూ సంస్కారమూ రెండూ అభ్యసిస్తే దీనికి నాయం దెచ్చుప్రేమ పుట్టి తీరతుంది. (ప్రకా) మనోహరరావూ, నీవు నాకొక ఉపకారము చేయవలెను.

మనో—అయ్యా! నాకు మానాన్నగారొకటి మీరొకటీ కాదు. అట్టిసందర్భమున నావల్ల ఏమైనా మీకు ప్రయోజన మున్నట్టయితే దానిని నిర్వహించడము నా విధి. ఏమి కావలెనో సెల వివ్వండి, చేతులు కట్టుకొని చేయడానికి సిద్ధముగా నున్నాను. నాచేత చేయించుకోవడమునకు మీకు సర్వస్వాతంత్ర్యము కలదు.



ఆనంద—నాభార్య ఇటీవల చాలా పాతమువ్రాని స్త్రీధర్మములను పాలించుకున్నది. దాని అభిప్రాయాలు, రుచులూ నా అభిప్రాయములకు ఆదర్శములకూ విపరీతముగా నున్నవి. దానికి డంబమం దభిరుచి హెచ్చుతూన్నది; పూర్వాచారములంటే దానికి ప్రాణము, సంస్కరణ అంటే తలనొప్పి. ఇందువల్ల మా కిద్దరికీ సామంజస్యము కుదురలేదు, ప్రతివిషయమునా ఎద్దెండకీ ఎనుబోతు నీడకీ లాగుతూంటే సంసార శకటము సరిగా నడువలేదు.

మనో—మీరు నన్ను క్షమిస్తే నామనసులోమాట చెప్పుతాను. మీరు కూర్చుకొన్న దాంపత్యము విషమము కదా. అన్యోన్యప్రేమ ఎట్లు పుట్టగలదు? "సమానశీల వ్యసనేషు సఖ్యమ్;" "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే" అని పెద్దలంటారు. ఇందు పొరపాటు మీవల్లనే జరిగింది. మొదటనే నాసలహా కోరియుంటే ఏ చిక్కూ లేకపోవును.

ఆనంద—ఈ కుఱ్ఱదానిని చూచీచూడడములోనే నాకు దానియెడ అనురాగ ముదయించి పరిణయించవలెనని కోర్కె పుట్టింది. ప్రీతివివాహము వాంఛనీయము కదా అని వెంటనే వివాహము చేసుకొన్నాను.

మనో—మీకు వధువుపై ప్రేమ పుట్టవచ్చును; ఆమెకు మీయెడ ప్రీతి యున్నదీ లేనిదీ కనుగొన్నారా?

ఆనంద—కలిసిమెలసి యున్నప్పు డనురాగ ముదయించితీరునని ఊహించితిని.

మనో—అట్టియనురాగ ముదయించవలెనంటే మీ రొక ప్రౌఢవనితను పెండ్లియాడితే బాగుండును. మీరు సంఘసంస్కర్తల తరఫున ఎన్నో ఉపన్యాసము లిచ్చి, ఎన్నో ప్రౌఢవివాహాలు చేయించి తుద కొక పసిపిల్లను వివాహమాడడము లోకమునకు వింతగా నున్నది.

ఆనంద—నిజమే. నా కిది తప్పనిసరి యైనది. నా భార్య గతించిన పిమ్మట నేనూ మీలాగే వివాహము మాని వేతామని నిశ్చయించినాను. కాని మాఅమ్మ పెళ్ళిచేసు కొమ్మని పట్టుపట్టుంది. ఎంతోకాలము బ్రతికేది కాదు. చిన్నప్పటినుండీ నన్నుకనిపెంచి పెద్దచేసింది, ఆమెమనసునొవ్వ జేయడమున కిష్టములేక పెళ్ళి కొప్పుకొన్నాను. వితంతూద్వాహము చేసుకొంటానని ఏదుష్టులో ఆమె చెవిలో ఊదినారు. అంతట ఆమె హఠముచేసి నే నాలాగుచేస్తే నూతిలో పడతా నన్నది. అన్నంతపనీ చేసేదే, ఆమె గుణము నే నెరుగుదును. ఏమి చేయను? విధిలేక వితంతువుమాట విడిచినాను. స్వీయవ్యవహారమునకూ సంఘసంస్కరణకూ ఘోరమైనపోరు పొసగి తుదకు సంస్కరణమునకు పరాజయము ప్రాప్తించింది.

మనో—స్వార్థము నందుకే త్యజించవలెనని మా వాదము.

ఆనంద—కార్యశూరుల కట్టి ధైర్య ముండునే కాని సాధారణుల కుండదు...అయినదాని గూర్చి చింతించి ఏమి ప్రయోజనము? ప్రస్తుతమున నేను మిమ్ము కోరే దేమంటే



మీ రధ్యాపనమున మిక్కిలి చతురులని వాడుక, కనుక నా భార్యకు సంస్కరణాభిలాష కల్గేటట్లు హితబోధ చేయవలెనని నా ప్రార్థన.

మనో—ఇట్టి విషయము లాప్తులు బోధించినకాని మనసుకి నచ్చవు; మీ యందు శ్రద్ధాభక్తు లుండును కావున మీరే యిందు కుపక్రమిస్తే కార్యఫలము చేకూరుతుందని నా యభిప్రాయము.

ఆనంద—రామరామ—నేను రెండుమూడుసారులు బోధించవలెనని యత్నించినాను. దానికి నిలువరాని నిద్ర వచ్చినది. నేర్పుగల మీబోట్లు బోధిస్తే వింటుందేమో అని యాశ యున్నది. ఈ భారము మీ మీదనే పూర్తిగా నుంచలేదు—రోజూ హరిహరశాస్త్రి పురాణము చెప్పుతూ తద్ద్వారా స్త్రీధర్మములు బోధిస్తునే ఉన్నాడు. వారికి మీరు తోడైతే కార్యసిద్ధి త్వరలో కాగలదని నాకు పూర్ణవిశ్వాస ముంది.

మనో—సరే—మీ యాజ్ఞ నుల్లంఘింపను...నేడు నే నొకపనిమీద మీదర్శనమునకు వచ్చినాను.

ఆనంద—నాగొడవలో అడుగ మరచినాను, మీ రాకకు గతమేమి? ఏదైనా ఉపన్యాస మివ్వవలెనా?

మనో—కాదు. ఒక వరునికి మంచి వధువును చూచి పెట్టవలెను.

ఆనంద—అవశ్య మట్లే చేసెదను. కన్య కావలెనా

వితంతువా?

మనో—వితంతువునే చేసుకోవలెనని అతని కున్నది కాని ఆమెతండ్రి నడుగడానికి ధైర్యము చాలలేదు.

ఆనంద—ఇట్టి విషయములో పిరికితన మేమీ ఉండ కూడదు. అడిగినంత మాత్రాన ప్రమాద మేమి?

మనో—వా రేమంటారో అని జంకు.

ఆనంద—ఇవ్వనీ, మాననీ, ఆసంగతి వేరు; అడిగితే తప్పు కాదే?

మనో—అట్లయిన సంకోచించక చెప్పుతూన్నాను. మా చకోరుడు నిన్ననే విదేశయాత్ర చేసి యింటికి వచ్చినాడు.

ఆనంద—బ్రహ్మానందము! వెంటనే గొప్ప సభ చేయింతాము. దాని విషయమై నా సహాయము కావలెనంటే చేయడానికి సిద్ధముగా నున్నాను.

మనో—వానికి తగిన వితంతువధువు కావలెను.

ఆనంద—మన శరణాలయములో లేదా?

మనో—వాని మనస్సు ఇదివరకే ఒకతెపై లగ్నమయినది.

ఆనం—పసిబాలుర మనస్సులగ్నము కావడమేమిటి! మీ కిష్టమైన దాని నొకర్తెను కట్టిపెట్టండి. కుర్రవాళ్ల కీవిషయమున పెత్తన మివ్వరాదు.

మనో—చకోరు డట్టి బాలుడు కాడు.



ఆనం—షరే- ఆపిల్ల యెవర్తె?

మనో—మీ కెరిగినదే.

ఆనం—నాకు జ్ఞప్తికి రాలేదు.

మనో—అది లోగడ చకోరునికి యివ్వనున్నదే.

ఆనం—అటులనా? ఎవర్తె చెప్పుమా?

మనో—మీ చంద్రిక.

ఆనం—ఔనౌను. విదేశమున కేగకపూర్వము మీ తమ్ముని కిత్తా మనుకొన్నదే..,చాలాకాలపుమాట...అది వాడు మరచిపోవు ననుకొన్నాను.

మనో—ఇప్పటివాళ్ల కట్టివిషయములు మరపునకు రావు.

ఆనం—చంద్రిక పునర్వివాహము చేసుకోవలెనని లేదు. వరునకే వివాహేచ్ఛ ఉంటే చాలదని నాయూహ. భర్త గతించినదాది మాచంద్రిక బెంగచేత కృశించినది. మనసిచ్చి మాటాడనే లేదు.

మనో—ఆముసలివానిపై ప్రేమచేతనే అట్లున్నదని మీ యూహ కాబోలు?

ఆనం—ఆఁ! ఎంత ముసలివాడు? దానిరాత అలాగున్నది కాని, నాకన్న అతడు రెండేళ్లేకదా పెద్ద...అదీకాక మా చంద్రికమనస్సు చాలా మెత్తనిది. దాని కాతనిమీదనే ధ్యానము, వేరుచింత లేనే లేదు.

మనో—ఒక్కసారి చంద్రికను చూడగల్గితే ఆమె

మనస్సు తిప్పగలడని మావానికి ధైర్యముంది.

ఆనం___ఇందు నాయర్ధాంగి యంగీకారము కావలెను ...అయినా, వారిద్దరూ చూచుకొనడానికి తగిన ఏర్పాటు చేసెదనని మనస్ఫూర్తిగా ప్రతిజ్ఞ చేసెదను.

మనో___నే కోరే దదే. అటుపిమ్మట తదర్హమయిన ఏర్పాటులు చేదాము.

( భీరుడు వచ్చును)

భీరు___బాబూ, భోజనానికి లేవవచ్చునని అమ్మగారు సెలవిచ్చారు, స్నానాలు చేయవచ్చు. (ఆనందరావు మనోహరుడు వెళ్లుదురు) నా పిరికిగుండె పట్టి నన్ను భీరుడన్నారు కాని, మాఅయ్యగారూ నాలాంటివారే; నేను చీకటిలో ఏ పనీ చెయ్యలేను, వారు వెల్తురులో చెయ్యలేరు; వారికి బతికున్నవాళ్ల భయము, నాకు దయ్యాలభయము. అదిగో వారప్పుడే స్నానాని కొస్తున్నారు, నీళ్లు తయారుగా లేకుంటే నాకొంపుకి నీరే. (పోవును)

---

మూడో రంగము- ఆనందరా వింటిముంగిలి.

(హరిహరశాస్త్రి- వేణమ్మ)

హరి___ఏమి నిశ్చయించుకొన్నావో చెప్పు; నామాట వింటే యావజ్జీవమూ హాయిగా నుండవచ్చును. లేదా అల్లరిపెట్టుతాను. పెనిమిటి గతించిన నాల్గువత్సరములలోనే పెడతోవబడి, పాపఫలము నొక మంత్రసాని సాయమున



అనాధశరణాలయము చేర్చిన సంగతి బైటపెట్టక మానను.

వేణు___ఆప్రసంగము తేవద్దు, నాకు మతి పోతుంది. ఆ బాలుని కడపటిసారి ముద్దిడి వదలునప్పుడు మిన్ను తెగి మీదపడ్డట్లు నాకన్నులు చీకట్లుకమ్మినవి. ఆపాపడీలోకము వదలినమాట సత్యమేనా?

హరి___నే నబద్ధ మాడుతానా? మన పాతకమునకు సాక్షిస్వరూపుడు మనల విడిచిపోయినాడు.

వేణు___పాపాత్మురాలను. నేనాపాపడిని వీడకుంటే వాడు బ్రతికియుండునేమో ?

హరి___ఆఁ! పెద్దవాడై నిన్ను పోషించియుండును, నీ కేచింతా లేకపోవును!

వేణు___నీవు మనుష్యజన్మ మెత్తినావా? నన్ను పెడదారిని పెట్టినవాడవు నీవు కావా? "నీకు చెప్పినానుకాని నాకు చెప్పుకొన్నానా'' అన్నట్లు [illegible] అని అందరికీ ధర్మాలు చెప్పుతూ [illegible] నన్ను చెరచి, గొప్ప పాతకమున ముంచి తత్ఫలము నీ కడుపున పెట్టుకొని మీదు మిక్కిలి ఇప్పు డెదురు తిరుగుతున్నావా? "అన్నివిషయములా నీ కపకీర్తి రాకుండా కాపాడేవాడను నే"నని అమాయికను, అసహాయనునైన నన్ను గోతిలోదింపి పైపెచ్చు బెడ్డతో కొట్టుతున్నావు. నాసంగతి బైటపడితే నీవు మాత్రము బైటపడవా?

హరి___నేను మగవాడను, మహారాజును. నన్నేవ

రేమి చేయగలరు! మా చిత్తము వచ్చినంతమందిని చెరచడానికి మాకు స్వాతంత్ర్య ముంది. మీ కట్టిది లేదు— "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని వేదవాక్యమే ప్రమాణము.

వేణు—బాగు బాగు—మగవాళ్ళు చేసిన ప్రతిదురాచారమునకూ ప్రమాణ ముంది కాని మాకు లేదు కాబోలు. ఆపాపనిగొంతు నీవే నొక్కి పారవేసితివా ఏమి!

హరి—అలాగే అనుకో, వాడీలోకమున లేడు. భయపడకు.

వేణు—ఔరా! మగవాళ్లెంతకైనా సాహసులు. కన్నబిడ్డని కాటికర్పించడానికైనా వెరువరు. వీళ్లమాయలో పడి కులకాంత లెందరో పాపకూపమున కూలినారు.

హరి—నామాట కేమి సమాధాన మిస్తావు? వేగము చెప్పు. నీతో మాట్లాడుతూ నిలుచుండడానికి నాకు తీరుబడిలేదు.

వేణు—ఔను. తీరుబడి ఏదీ? ఇంకెందరి కొంపలు కూల్చవలెనో? మంచి వ్యాపారమే, మదు పక్కర లేదు.

హరి—వెర్రిదానా, తరుణము చిక్కినప్పుడు మానుకొనే మూర్ఖుడుండడు; చిత్రాహుతులుకన్న ప్రాణాహుతులు పెద్దవి. గొప్పగొప్పవారందరూ స్వార్థమును చూసుకొన్న తరువాత ధర్మము నాచరిస్తున్నారు. ఈ యూకదం పేల? నేను చెప్పినట్లు నడుచుకొంటావా? లేక పసువుపోయి బైట



పడుతావా? ఇంతతో నిద యూగునని తలచకు. రవ్వపెట్టి రచ్చకీడ్చి తీరుతాను.

వేణు—అంతపనీ చేసేవాడవే. మహాపాతకములు నీకు మామూలు కార్యములే.

హరి—ఏమన్నా సరే- నాకు చింతలేదు. అన్నిటికీ తెగించినాను.

వేణు—తినగూడనివి తిన్నా తాగకూడనివి తాగినా ఇతరులను దండించడానికి సిద్ధపడి తమరు రహస్యముగా ఆ పనులే చేస్తూండలేదా?

హరి—శ్ -- వాదనతో పనిలేదు- నామాటకు సమాధాన మివ్వవా?

వేణు—వేరుమార్గము లేదు. నీమాట వినకతప్పదు. కానీ మరి.

హరి—త్వరగా తెలివితెచ్చుకొన్నావు. లేకుంటే నీ పాట్లు కుక్కలూ పడకపోవును.

వేణు—ఒక షరతుమీద ఒప్పుకుంటాను.

హరి—ఏమిటా షరతు?

వేణు—ఆమెను నీకు స్వాధీనము చేస్తాను కాని నామీ దాశ నీవు వదలుకోవలెను.

హరి—అది లొంగుతే నీగోల నాకెందుకు? నిన్ను ప్రవేశపెట్టబోయే యింటినిగురించి కొంత నీతో చెప్పవలెను. యజమాని పే రానందరావు-ఆతనికి కాలము మళ్ళింది కాని

పడుచుదానిని పెళ్ళియాడినాను. ఆమె కది మనసుకురాని మనువు, కనుక ఆమెమనస్సును నాదెసకు తిప్పడము నీకు కష్ట మైనపని కాదు. ఆమె నాకు చిక్కినతరువాత నీచిత్తమువచ్చి నచోటికి పో, నేను వద్దనను.

వేణు——అవును. మిష్టాన్నము దొరికినప్పుడు చద్ది ఒక లెక్కా?

హరి——ఆమె నాకు చిక్కితే స్వర్గసుఖము పొందనా? బ్రతికినందు కదే సార్థక్యము... కాని నీమీది ప్రేమ మాత్ర ము నాకు యావజ్జీవ ముండేదే... పోయి వస్తాను-(వెళ్లును)

వేణు——వీడిబ్రతుకు పాడ, ఎంత దురంతమును తల పెట్టినాడు! నా ప్రారబ్ధముకొద్దీ నేను వీడిమాయలో పడ్డాను. ఈ పాపమే చాలు, వీడి కొవ్వు కరిగించే మహాత్ము లుంటే తగినప్రాయశ్చిత్తమవును. ఇట్టివాళ్లని నిలువునా చీల్చడమో, లేకుంటే ప్రాణాల్లతో పాతివేయడమో జరుగుతే నాబోటి అనాథ లెందరో సుఖిస్తారు. దైవమా, త్వరలో వీని రోగ ము కుదుర్చు తండ్రీ!

——

——నాల్గో రంగము—— ఆనందరా విల్లు.

చంద్రిక, హంసిక, తార, కమల,

హంసి——ఆరునెలలనుంచీ నీ వొకమూల కూర్చుండి అదే దీక్షగా ఏడుస్తున్నావు. చచ్చినవాడు వచ్చినాడా? ఎందు కీవృథావిలాపము? మాతో కలిసి ఆటాపాటా అని కాలయా



పనము చేస్తే రవ్వంతైనా సుఖము చేకూరుతుంది.

చంద్రి——నీ వాడుతూన్నప్పు డెవ్వరైనా దానిని చెదర గొట్టితే నీ కేడ్పు రాదా?

హంసి——నీ వెప్పుడూ ఆడందే? నీయాట చెదరగొ ట్టడ మేలాగు?

చంద్రి——నా సంసారపాట నాదౌర్భాగ్యముచేత చెదరి పోయింది కాదా?

హంసి——ముసలివాని కోస మేడవడ మెందుకే? అ ప్పుడు కాకపోతే కొద్దికాలములో నేనా తరలిపోయేవాడు.

తార——వా డెక్కడి మగడే? మనము బొమ్మలా టాడేటప్పుడు చంద్రికను చకోరుని కిచ్చి పెళ్లిచేసినాము కా మటే? దానితండ్రి యిచ్చినదే మారుమనువు.

చంద్రి——ఊరుకో-ఎవ్వరైనా వింటే బాగుండదు.

హంసి——మేము చేసిందే నిజమైనపెళ్లి. రెండోపెళ్లి వావి సరిపడలేదు, అదిచెల్లదు; కుండమార్పుపెళ్లి కూడదు, అందుకే బెడిసికొట్టింది.

చంద్రి——మీ మాటలు నన్ను క్షోభపెట్టడముతప్ప వేరుపనికి పనికిరావు.

హంసి——మా ఆటలో నిన్ను చేర్చుకోక మానము.

కమల——ఏ మాటాడుదాము?

తార——గోలపెట్టే ఆటవద్దు - సరస్వతమ్మ వింటే తక్షణమే గెంటివేస్తుంది.

హంసి—చంద్రిక జుట్టు తీసివేయలేదని కారాలూ మిరియాలూ నూరుతూన్నది. నున యీడుదే కాని ముసలి మగని కట్టుకొని ఎంత మురిసిపోతూన్నదే! తన ఒంటినిండా నగలు కావలెను, కాని మా అక్కయ్యనెత్తిమీద జుట్టుండడము చూస్తే ఆమెకళ్లు కుట్టుతూన్నవి.

చంద్రి—ఆమె నేమీ అనకండి-ఈడుకి చిన్నదైనా వరువుకి పెద్దది.

తార—గౌరీదేవిఆట ఆడుదాము. (గౌరీదేవిని నిల్పుతారు)

(సరస్వతి వచ్చును)

హంసి—పేరంటాళ్లకి కుంకుమబొట్లు నేను పెట్టుతాను. (చంద్రికకు పెట్టును.)

చంద్రి—(చెరపుకొని) హంసీ-ఇది నీకు తగదు-నేను నోచుకోని బొట్టు నాకు పెట్టరాదు-ఆటలో పరిహాసించడానికా నన్ను చేరుమన్నావు?

హంసి—ఆటలో చేరినదాకా నీ యిష్టము, చేరిన తరువాత మా యిష్టము.

చంద్రి—బొట్టుపెట్టగల్గినావు కాని నారాత మార్చగలవా? ఎందుకీ కూడనిపని?

హంసి—మాఆటలో నీవూ పేరంటాలువే. మేము చేసిన మగడు బ్రతికియున్నాడు-బొట్టు చెరుపుకోకు. (తిరిగీ పెట్టును.)



సర—ఏమి టీ కూడని పని? చంద్రికా, నీకూ సిగ్గు లేదా? చిన్నపిల్లచేత బొట్టు పెట్టించుకొంటావా? అవును-అంతా సంస్కర్తల పిల్లలు-మీచేతలు మండినట్లే ఉన్నవి. మాకాలములో మే మిట్టియాగడము తెరుగము-వినాశకాలమున విపరీతబుద్ధు లిలాంటివే?

హంసి—నీవు పెద్దముత్తైదువైనావు కాబోలు!మా కాల మంటున్నావు? ఎన్నాళ్లయింది నీవు కాపురానికి వచ్చి?

సర—పెద్దలమర్యాద బాగా నిల్పెదవులే. అవకతవక మాట లాడితే దవడపళ్ళు రాలేటట్టు శాస్తి కాగలదు, జాగ్రత్త.

చంద్రి—చిన్నది-అభమూ శుభమూ ఎరుగదు. దానిపై కోపమేల?

సర—ఎంత నంగనాచివే? దానిని వెంటవేసుకొని వచ్చినావా?

(ఆనందరావు విహారుడూ వత్తురు)

ఆనం—ఏమి టీ గోల?

సర—మీబుద్ధిశాలిని కూతురి నడగండి. అల్లరిచేయవలసినంతా చేసి ముద్దరాలు శిద్దెలాగు కూర్చుంది.

విహా—చంద్రికా, జరిగిం దేదో చెప్పు.

చంద్రి—ఏమీ లేదు-అజ్ఞానముచేత హంసిక ఆటాడుతూ నా నుదుట కుంకుమబొట్టు పెట్టినది; నేను వద్దని చెరిపినాను-పిల్లలందరూ నిర్బంధముచేత తిరిగీ పెట్టినారు,

నేను చెరపినాను-వాళ్ళు వద్దని కేకలు వేసినారు.

సర—వితంతువు కుంకుమబొట్టు పెట్టుకోవడము కూడునా? పైపెచ్చు ఎత్తిపొడుపు కూడానూ?

చంద్రి—నే నూరుకొన్నా కోపమే, మాటలాడినా కోపమే; ఎట్లు మెసలుకోవలెనో చెప్పితే, అట్లే నడుచుకొంటాను.

సర—నీవు బుద్ధిశాలినివి! నీ కెవరు చెప్పగలరు తల్లీ? నీయిష్టమువచ్చినలాగు ఒంటినిండా పసుపు రాసుకొని నుదుట కుంకుమబొట్టు పెట్టుకొని తలకు వాసననూనె రాసి పువ్వులు ముడుచుకొని ఊరేగు. అందరూ ఆనందిస్తారు నీ అందానికి.

ఆనం—ఆటలలో జరిగినది కావున అది గొప్ప అపరాధము కాదు.

సర—ఓహో! మీరు వితంతువులపక్షమువారన్న మాట మరచినాను. మీరుకూడా వితంతువునే కట్టుకుంటే ఇష్టమువచ్చినట్లు చేయడముకు వీ లుండును. నే నొకర్తెను మధ్య వచ్చినానుగనుక ఈలాంటి భ్రష్టాచారములు సాగనివ్వను.

చంద్రి—నే నామె నెంత వేడుకున్నా ఆమెకు నాపై దయ రాలేదు.

ఆనంద—ఇది గొప్పతప్పు కాదు గనుక క్షమించవలసినదే.

సర—అదిగో, మీ ఆసరా చూచుకొనే ఇది విర్రవీగు



తూన్నది-ఇప్పుడు బొట్టుపెట్టుకుంది, రేపు గాను తొడుగుతుంది, ఎల్లుండి ఎవనితోనో లేచిపోతుంది-అప్పుడు కాని నా మాటల విలువ తెలియదు.

ఆనం—ఔను. ఇట్టిచేష్టలు మాన్పించవలసినదే.

చంద్రి—నాన్నా! నీకు కూడా నామీద దయ తప్పినదా?

విహా—నీవు ధర్మము నతిక్రమించడము పొరపాటే.

సర—అదీ సరియైనమాట-ఎవరిధర్మము వారు నిల్పుకోకుంటే లోక ముంటుందా?

విహా—తప్పు జరిగినది కాని దండన హెచ్చైయినది. చిన్నతప్పు చేస్తే పెద్దశిక్ష విధించరాదు.

సర—ఈకాలమున ఆడవాళ్లే మాటవినకుంటే మగవాళ్ళు వింటారా? అడ్డాల్లో ఉన్నన్నాళ్లే బిడ్డలు, గడ్డాలు వచ్చినపిమ్మట బిడ్డలుకారు.

విహా—నేను చిన్నవాడనైనా నీకన్న పెద్దవాడను. నీవూ నాన్నగారూ ఈలాం చంద్రికను సాధిస్తూంటే దాని జీవితము దుర్భరము కాదా? మీరు తప్ప దాని కింక దిక్కెవ్వరు?

సర—పరేంగితజ్ఞానమున్న నీ వుండగా ఇతరుల ప్రశంస యెందుకు? వెంటా తీసుకొనిపోయి సుఖపెట్టు-మా సంరక్షణలోనుంటే దానికి సుఖము లేదుగా? అభిమానశాలివి, అన్నయ్యవు-నీవే దానికి దిక్కు కాగలవు.

విహా—మీ యిష్ట మెట్లో అట్లే కానీ, చంద్రికా, నాతో మాయింటికి రా, పోదాము.

హంసి—అక్కయ్యను వదలి నేనరనిముస ముండను. నేనూ మీయింటికే వస్తాను.

సర—పీడ వదలింది-ఇద్దరూ కట్టగట్టుకొని పోయి సుఖముగా నుండండి...(వారు పోవుదురు) చూచినారా మీపిల్లల సౌజన్యము? మీరు వాళ్ళ కెక్కువ చను విచ్చినందుకు పర్యవసాన మిది. ఇలా గెదిరిస్తే నాకు సరిపడదు, అలాటివాళ్ళని నాయింట నుండనివ్వను.

ఆనం—వీళ్ళు పోవడ మొకవిధాన మంచిదే కాని, ఇంటిపని నీ వొక్కర్తవే చేసుకోవలెను కదా అని విచారిస్తూన్నాను.

సర—ఔను. కోపము వస్తే నాకు ఒళ్లూ పై తెలియదు మీరేనా కాస్త చెప్పవలసింది.

ఆనంద—కాలిన చమురుమీద నీళ్ళు జల్లినట్లు మరింత కోపము హెచ్చి నామర్యాద కూడా నిల్పవుకదా అని ఆలాగు చెయ్యలేను.

(హరిహరశాస్త్రి వేణమ్మ వత్తురు)

హరి—ఇదిగో పంతులుగారూ, వంటలక్కను కుదిర్చినాను-మంచి, కలుపుగోరు, పని చేతిలోనుంది, ఒళ్ళు దాచుకోదు-నేను స్వయముగా నెరుగుదును, మీయింట నుండ తగినది. జీత మైదురూపాయిలు, భోజనముపెట్టి సంవత్స



రాది నొక జామా రివ్వవలెను.

సర—ఈమె చేతివంట దేవతార్చనకు పనికివస్తుందా?

హరి—మీ రీవిషయము నాతో చెప్పలేదే? ఐనా యిటీవల సంఘసంస్కర్తలు మనఊళ్లో తలయెత్తినప్పటినుండీ తలవెండ్రుకలు తీసినవాళ్ళు దొరకలేదు-వేణమ్మవంటివాళ్ళ నాపద్ధర్మముక్రింద లెక్క వేయవచ్చును. శాస్త్ర మొప్పుకొంటుంది-

సర—శాస్త్రులుగారూ! ఈమెచేతియన్నము భుజించినందుకు మాకు కలిగే పాతకము మీరు భరించినట్లయితే మే మీమె నౌఖరీ కొప్పుకొంటాము. (నవ్వును)

హరి—మీదయయుంటే ఈపాతక మొకలెక్క కాదు మీ కొరకేమి చేయుమంటే అది చేయడానికి సర్వసిద్ధముగా నున్నాను.

ఆనం—శాస్త్రులుగారికి మనమీద పరిపూర్ణానుగ్రహముంది గనుక నీవు పనిచేసుకోవడ మిష్టములేక తగిన వంటలక్కను తక్షణమే తెచ్చినారు. అయ్యా! ఇంకొక్క స్వల్ప సాహాయ్య మపేక్షిస్తూన్నాము. ఈరోజునుండీ మాయావిడ కింక తీరుబాటుగానుంటుంది కావున పురాణకాలక్షేపమునకు తమరు నిత్యమూ దయచేయవలెనని మా ప్రార్థన.

హరి—మీదంపతుల దర్శన మనుదినమూ లభించడము నా పూర్వపుణ్యఫలము. అవశ్య మట్లే చేసెదను.

---

—॥ ఐదోరంగము ॥— (అనాథశరణాలయము.)

చకోరుడు పచారుచేస్తూండును

ఆహా! ఏమి కాలవైపరీత్యము! ముసలిమూర్ఖుడొక ముదితను తనకు చేకూర్చినాడని ముద్దులుగుల్కు ముద్దరాలైన కూతురి నతనికి కట్టిబెట్టెను కదా ఆనందరావు. విహారు డందుకు నోరెత్తలేదు. ఈరెండు క్రూరకార్యములూ అక్షరశూన్యులైన విప్రుల అర్థముకాని మంత్రోచ్చారణవల్ల వివాహము లనిపించుకొన్నవి. మొదటి మూర్ఖుడొనర్చిన పాతకము పామై యాతని కరచుటచేత తగినప్రాయశ్చిత్త.మొనర్చుట కాతడు వెంటనే దివి కేగెను. ఏకర్మ మెఱుగని యాతనివధువు ముచ్చట నొకటైనా వీగక మూలచేరినది. ఆమెకళ్ళయెదుట నామెవృద్ధజనకుడు నవోఢయైన చిన్నభార్యతో ముద్దుముచ్చటల మురియుచున్నాడు! స్వసుఖాభిలాషులకు కన్నవారియెడనైనా కనికర ముండదు కాబోలు! ఈదురాచరణమును గూర్చి చర్చచేసేవారు కాని, ఆ బాలికయెడ సానుభూతి కన్పరచువారుకాని ఒకరైనా కాన రారే? సంఘాభివృద్ధికీ దేశసేవకొరకున్నూ విదేశమరిగిన నన్నూ నాకుటుంబమునూ బహిష్కరించవలెనని భగీరథ ప్రయత్నములు జరుపుతూన్నారు. వీరికి బుద్ధియున్న దందునా, లేదందునా?

ఆహా! మనభారతీయులు నేడెంత దురవస్థలో మునిగియున్నారు! తమదేశపరిస్థితులు జాతీయాభివృద్ధి కనుకూలముగా లేవని యితరజాతీయుల ఉత్తమపరిస్థితులను తామవలంబించి తక్కినజాతులతో సమముగా తలయెత్తి తిరుగవలెనని జపానీయులు పాటుపడుతూ ఉండగా, మావాళ్లు ఏకాలమునో వ్రాసిన గ్రంథములనే ప్రమాణముగా గొని మాసంఘమును వెనకకు లాగయత్నిస్తూన్నారు. వీరి విద్యాబుద్ధుల పరిణామ మిట్టిదాయెను కదా, ఇక మా కభివృద్ధి చేకూరడ మెప్పటికి? సంఘ మిట్లధోగతిని బడియుండ మావాళ్ళు రాజకీయహక్కులకోస మాంగ్లేయులతో పోరు సల్పుతూన్నారు. ఒకవేళ నట్టిహక్కులు లభించినా వీరు వాటిని నిల్పుకోగలరా? ఆత్మగౌరవము లేక ఇంటిలో బానిసలుగా నున్నవాళ్ళు బైట నధికారులు కాగలరా?

విహారుడు పూర్వాచారపరాయణులలో చేరినవాడు, ప్రస్తుతమున చంద్రిక వానియందు నున్నది. నేనుజపానునుండి తిరిగివచ్చినప్పటినుండీ వాడామెను కఠినశిక్షలో నుంచినాడని వదంతి. పూర్వాచారప్రవర్తకులైన శాస్త్రవేత్తలు, పౌరాణికులు, వైదికబ్రాహ్మణులు, బైరాగులూ తప్ప ఇతరులతో మాటాడ నివ్వడట, చూడనివ్వడట. నేనామెను చూడవలెనంటే యిందులో నేదో వేషము వేయవలెను. వేషము వేయగలను కాని తదనుగుణమైన వర్తన నాకెట్లబ్బుతుంది? ఛీ ఛీ, తుదకు వేషధారణమే దిక్కయ్యెను. కాని కార్యవాదు లిట్లొనర్పక వీలులేదు. సాధ్య మతిపవిత్రము, లోకోపకారకము కావున సాధనమును పవిత్రము

చేయగలదు. ఎందరెందరో తొక్కినదారి కాని ఇది క్రొత్తది కాదు, ఇందు పాపశంక యుండనక్కరలేదు. సర్వజ్ఞునిపై భారమువేసి నాశక్తికొద్ది ఆ యనాథకు సాయము చేయ యత్నిస్తాను.






# రెండో అంకము

---

## — మొదటి రంగము —

(మనోహరు డేదో ఆలోచిస్తూండును)

మనో—తనభార్యకు విద్య నేర్పడాని కానందరావుగారు నన్ను నియమించినారు కాని యీమె వైఖరినిబట్టి నాపని అంతకంతకూ కష్టతర మవుతూన్నది-ఈమె విలాసాసక్తురాలు కావడముచేత నా యుపదేశములు విఫలము లవుతూన్నవి-

(సరస్వతి ప్రవేశించును)

సర—(స్వ) వీరి సహవాసము నా కమితసుఖమును చేకూరుస్తూన్నది. గురువుగారియందు గాఢమైన భక్తి, అనురాగమూ లేకుంటే విద్య లభించదు. కడచిన నాలుగైదు రోజులనుండి వీరియందే నాదృష్టి లగ్నమయి ఎన్నో క్రొత్త విషయము లెరుగగల్గితిని.

మనో—సరస్వతమ్మా!

సర.__మీ రిట్లు నన్ను పిలిస్తే పలకడానికి నాకు లజ్జాకరముగా నున్నది నేను మీ శిష్యురాలను...

మనో.__సరస్వతీ, నేడాకాశము మేఘమాలచే నెట్లు నిండియున్నదో చూడు-గీటురాతిమీది సువర్ణరేఖల వలె మెరుపులు ప్రకాశిస్తూన్నవి. కల్మషహృదయుని దరి జేరనిచ్చితిమా వాడు పెచ్చుపెరిగి మనకీర్తిని హరించునట్లీ మేఘసముదాయము శుభ్రచంద్రికను హరించినది-కారు మొయిళ్ళను రాక్షససైన్యములు మెరుపను గుగ్గిలపు వెలుగున కేకలు వేస్తూ దిఙ్మండల మనే తెర వెలపలికి వస్తూన్నవి-గాలిచేత చలింపబడిన చెట్లు తమ బాహువులను చాచి నాట్యమాడుతూన్నవి...అదే గాలివాన వస్తూన్నది-ఈ ఝంఝూమారుతము సర్వశక్తుడైన ఈశ్వరుని నిశ్వాసమువలె నున్నది-కాని యావేగమున భూమ్యాకాశములు గడగడ వడకుతున్నవి-వీటిశక్తిముందర మానవుని ప్రతాప మేపాటి? ఎంత నాస్తికునకైనా సర్వశక్తుడున్నాడని ఈమెరుపులూ, ఉరుములూ నమ్మకము కలిగించి తీరును.

సర.__(స్వ) అదేమో కాని వీటిని చూస్తే నాకు ప్రేమాలోచనలే పుట్టుతూన్నవి-(ప్రకా) బాహ్యసృష్టిని చూచినకొద్దీ హృదయము ప్రేమభరితమై సన్నిహితమైన హృదయముదెస నాకర్షింపబడి మైత్రిని వెలయింప గోరుతూన్నది.

మనో.__చూచినావా మనము చూస్తూన్న వస్తు



వొకటే అయినా మనభావము లెంత భిన్నము లవుతూన్నవో? చిత్తవృత్తి ననుసరించి భావోదయ మవుతూండు నన డానికిదే తార్కాణము-నీ యూహలు ప్రేమపూరితమైన పత్నికి తగినట్లున్నవి.

సర.__నా కాపురము సుఖావహ మనేనా మీ ఊహ?

మనో.__నీ కేమి లోటు-? ఆనందరావుగారివంటి ఐశ్వర్యవంతుడు నీకు భర్తయైయుండ నీపదవి కేమిలోప ముండగలదు?

సర.__ఐశ్వర్యము, ఉన్నతపదవి, అధికారము మాత్రమే కోరదగిన భోగము లయినట్లైతే మీరు వాటిని పరిత్యజించి సాధువృత్తి నేల పూనినారు?

మనో.__అందరూ నావంటివారే అవుతారా?

సర.__ఇన్నాళ్లు మీరు నాకు విద్యగరపి వివేకము కల్గించినందున మీయూహలు నాకు నచ్చడ మొక వింత అవునా?

మనో.__నీయందు నీపతి కమితానురాగ మని ఒప్పుకొందువా?

సర.__అదే నా కిప్పుడు విచారకారణము.

మనో.__ఎందుచేత?

సర.__నేను వారి నెంత ప్రేమించినా వారికి నాయెడ నుండే ప్రేమతో నాప్రేమ తులతూగలేదు-ప్రేమఋణ మింకొక వస్తువులిచ్చి తీర్చుకొనతగినది కాదు-అది క్రయవిక్రయ

సామగ్రి కాదు-దాని కదే సాటి-దానివిలువ యింతంత అని చెప్ప వీలులేదు-దానిదారి వేరు-మనల ప్రేమించినవారిని మనము ప్రేమించకపోవడము, మనము ప్రేమించినవారు మనల ప్రేమించకపోవడమూ సహజముగా సంభవించును. ప్రణయధన మమూల్యము-దాని నెవరైనా తస్కరించిన యెడల యజమాని ఖేదపడును-ఇట్లు చేయగలవ్యక్తి ఒకడే కాని పెక్కుమంది యుండరు-ప్రేమకు మారుప్రేమ లభిస్తే అది మనమున గాఢముగా నాటి యమితసుఖ మిచ్చును-అట్టిది లభించకపోయినయెడల మనప్రేమ రూపుమాయక తన క్లిష్టమైన దెసకు పారి అనుక్షణమూ పెరుగుచుండును. కడుపులోనుండి లేనిది కౌగిలిస్తే రానేరదు-

మనో—సరస్వతీ, ఈజగము లోపహీనము కాదు-మనము కోరినట్లన్నీ కలిసిరావు, కాబట్టి ప్రాప్తించిన లేశమే పదివేలని తృప్తిచెందవలెను; దీనినే సంతుష్టియందురు. అది పరమసుఖదాయకము-దైవానుగ్రహమున నీవు సంతానవతివైతే దానిరుచి నీకు తెలియగలదు ఈ సుఖానుభవము స్త్రీలకే అబ్బును కాని పురుషులకు లభ్యము కాదు. పుత్రప్రేమ తక్కిన ప్రేమకు మూలాధారము-

సర—మి మ్మొకటి అడుగవలెనని యున్నది-అధిక ప్రసంగమని ఆగ్రహించకుంటే అడుగుతాను.

మనో—అట్టి సంకోచము వద్దు-అడుగు-



సర—మీభార్యవల్ల మీ కేమాత్రముసుఖము లభించింది?

మనో—ఆమెకు కొన్ని లోపము లున్నమాట నిజము-సౌందర్యవతి కాదు, చదువుకొన్నది కాదు. కులాభిమానమూ ఔదార్యమూ లేవు ..కాని మొత్తముమీద మా దాంపత్య మనుకూలముగానే జరిగిందనవచ్చును. ఆమెను చూచి జాలిపుట్టి నేను కడుంగడు ప్రేమిస్తూంటిని-

సర—మీరు ద్వితీయవివాహ మేల చేసుకోలేదు? మీజోడెందరో అట్లు కావించి సుఖ మనుభవించలేదా? మొదటిపెళ్ళామువల్ల కలుగని సుఖమును రెండో భార్యవల్ల తీర్చుకోలేదా?

మనో—ప్రేమభాజనమైన పెళ్లాము గతించినవెనుక ఆప్రేమ కర్హులైనవారు లేకుంటే కదా తిరిగీ పెళ్లి జేసుకోవలెను? అట్టి ప్రేమభాజనులు అనేకులు ప్రపంచమున కనబడుతున్నారు. ఒకవ్యక్తికి క్లిష్టమైననాప్రేమ యిప్పుడు అనాథలయెడ వ్యాపించినది. మానవసేవ చేసి పరమార్థమును పొందనెంచువారికి ప్రపంచము కర్మభూమి కాగలదు సంసారము త్యజించి సన్యాసికానక్కరలేదు. ఏవ్యక్తినైనా యితరులు నిరాకరించినట్లు నాకు తెలిసినట్లైతే నాకమిత విషాదము కల్గి ఆర్తరక్షణ మేవిధముననైనా చేసేవరకూ చిత్తమునకు శాంతిచేకూరదు.

సర—(స్వ) చంద్రికయెడ నే నగుపరస్తూన్న నిరా

దరణకు ఎత్తిపొడుస్తూన్నట్లుంది. (ప్ర) ప్రథమసందర్భముననే జనులు మనయెడ ద్వేషభావము పూనినయెడల మన మేమి చేయగలము?

మనో—మనస్ఫూర్తిగా మన మిత్రులను ప్రేమించినట్టయితే వారు మనయెడ నెంతకాలము ద్వేషము పూనగలరు? తుదకు మనల ప్రేమించి తీరుతారు.

సర—ప్రేమ ప్రేమను గొల్పునని మీయూహ కాబోలు?

మనో—సందేహమా? నిర్మలమైన ప్రేమతో మన మిత్రులను గౌరవించినయెడల నా ప్రేమ అంతకంతకు దృఢమగునుకాని భంగము కాబోదు. ప్రేమకు లోబడని శత్రువులు ప్రపంచమున నుండరు. నిర్జీవసృష్టియందే ప్రేమ ప్రతిప్రేమను గొల్పునప్పుడు సజీవసృష్టియందు మాత్రమట్లు జరుగనేరదా?

సర—(స్వ) ఈపల్కులు విన్నకొద్దీ నామానసమీతని విడువకున్నది. అనురాగ మనుక్షణ మీతని సంసర్గమునకే పురికొల్పుతూన్నది. (ప్ర) అహో! మీబోధామృతాస్వాదనమువల్ల నాచిత్తము తన్మయతనొందుతూన్నది. మీ యుపదేశముల నాచరణలో పాలించుట నా కీజన్మమున శక్యము కాదు, కాని నాశక్తికొద్దీ అట్లాచరించే యత్నము చేస్తూంటాను.

మనో—నీనిశ్చయము దృఢమవునట్లీశ్వరుడు కృప జూపును గాక! ఇక మనప్రసంగ మాపుదాము.

సర—మిమ్ము విడిచిపోవ మనసొప్పకున్నది కాని



భోజనసమయ మైనది, వెళ్లక తప్పదు.

మనో—అట్లైన జాలమువద్దు. నేనూపోయివచ్చెదను.

సర—వర్షము తీవ్రముగా కురుస్తూన్నదే?

మనో—తొందర పని యున్నది. ఈ వర్ష మెంత?

(పోవును)

సర—(కిటికీదరికి పోయి) ఆహా! ఈతుంపరలు నా శరీరమును చల్లబరుచునట్లు ఈతని సుబోధామృతబిందువులు నాతప్తహృదయమును కొంతవరకు శమింపచేస్తూన్నవి.

---

రెండోరంగము—విహారునిల్లు.

మనోహరుడు, తరంగిణి.

తర—మన చకోరు డూరికి వచ్చి నన్నింకా చూడరాలే దేమి?

మనో—వాడు వచ్చినాడని నీ భర్త చెప్పనేలేదా?

తర—లేదు, పనితొందరలో మరచినారేమో!

మనో—చకోరుడు వచ్చినట్లు మేము నీకు చెప్పకపోవడమునకు కారణముంది.

తర—ఏమి టదీ?

మనో—చకోరుని వెలివేయడమునకు యత్నములు జరుగుతూన్నవి.

తర—అదేమిటి? నాకు తెలియనే లేదు!

మనో—మీపంతులుగారే అందుకు సూత్రధారి.

ఈ విషయము నెరిగినట్టి చకోరుడు మీ యింటి కెట్లు రాగలడు?

తర — వారెంత దయార్ద్రహృదయులో నీ వెరుగవు. అతిథిసత్కారమం దాయన కత్యంతశ్రద్ధ. రవ్వంత లోపముకూడా రానీయడు. మీ రిద్దరూ భిన్నాభిప్రాయులు కావడముచేత మీకు మైత్రి ఘటిల్లలేదు.

మనో — అభిప్రాయము లాదర్శములూ వేరు కావచ్చును, దాని కేమి? విధిలేక నన్ను మీ యింటికి రానిస్తూన్నాడు కాని మా శరణాలయములో నిన్ను కాలు పెట్టనిస్తున్నాడా? మా యుద్యమమున కేదైనా సాయము చేస్తున్నాడా? పాప మాయనాథ లతని కేమికీడొనర్చినారు? వితంతువులున్న ప్రతికూలభావము వహించిన వారెందరో మా యాశ్రమమున వారు మసలుకొనేరీతిని ప్రత్యక్షముగా చూచి దురభిప్రాయములను మార్చుకొని అనుకూలు లైనారు. మీ వారు మా వంక చూడనే చూడరు.

తర — మీ యాశ్రమమును జూపండని వారిని నే నెన్నిసారులో నొక్కి యడిగినాను, కాని ఏదో మిషపెట్టి [illegible] తప్పించుకుంటూ వచ్చినారు. వితంతువులు జుట్టు నుంచుకోవడము కూడా వారికి మునుపు కిట్టేదికాదు, కాని మా యాడపడుచు కాయవస్థ ప్రాప్తించి నప్పటినుండీ వారభిప్రాయము మార్చుకొన్నారు.

మనో — చూచినావా? "తలకు దాకకున్న తన కేమి తెలియద"న్నట్లు కష్టములు మనకు సంభవించినప్పుడు



కాని దురాగ్రహమూ, దురభిమానమూ దూరముగా నుండవు.

తర — ఈవిషయమున హరిహరశాస్త్రిగారు నెల దినములనుండీ తగవు పెట్టుతూన్నా లేశమైనా లొంగినారు కారు.

మనో — ఇత డెవడు? ఈపేరు యిదివర కొకసారి విన్నాను.

తర — ఉన్నా డొక పుట్టుశాస్త్రి. అతి కుటిలుడు బడాయికోరు.

మనో — ఇత డెవడో మోసగానివలె నున్నాడు. ఆనందరావుగారి యింట అతి చనువుతో తిరుగుతూన్నాడు, ఆశాస్త్రి కాడుకదా?

తర — అతడే కాని అంత చనువు లేదు.

మనో — ఆఁ లేకేమి? వారింట పురాణము చెప్పడానికి కుదురుకొని ఆనందరావుకి బహిఃప్రాణ మైనాడు.

తర — ఆలాగా? వాడు నాగుబామువంటివాడు సుమా, నిన్న వాడిని గూర్చి నే నొక అమర్యాదాప్రసంగము విన్నాను.

మనో — అయితే శీఘ్రముగానే అతని కుద్వాసన చేయించవలెను.

తర — మా యింటినుండి తగిలివేయవలెనని నాకూ తోచింది, కాని మావా రెంత అమాయకులో నీ వెరుగుదువుకదా? అయనకి శాస్త్రి దురాచారుడని విశ్వాసము కుదిరితేనే కాని బైటికి పొమ్మనరు...అదుగో వారిద్దరూ

వచ్చినట్లున్నది, నేనింటిలోకి పోవలెను.

మనో—శాస్త్రిగురించి తగినంత భోగట్టా జాగ్రత్త పెట్టుమా ! నేను పోయివస్తాను.

---

—। మూడోరంగము ।—

విహారుడు, హరిహరశాస్త్రి.

హరి—అబ్బాయిగారూ, మీబోటి ధర్మాసక్తులు మాలో నున్నారు గనుకనే మేము నెగ్గుకొని వస్తూన్నాము. నేటి పునరుద్వాహసభలో మీరు సనాతనధర్మపక్షమవలంబించి ప్రసంగించకపోతే అది సన్నగిల్లియుండును. మీధర్మానురక్తి, ఆవేశమున్నూ వేనోళ్ళ పొగడవలెనండీ. బలే !

విహా—ఇ దీనాటిది కాదు. నాకు చిన్నప్పటినుండీ యీవెర్రి యున్నది.

హరి—ఇది వెర్రి అనవచ్చునా ? అట్లైన నిక బుద్ధి యెట్టిది? మీ రతివినయశీలురు. మీవాగ్ధోరణి వింటూ నివ్వెరపడ్డాను. అంత నిర్భయముగా మీరు మాటలాడుదురని నే ననుకొనలేదు సుమండీ.

విహా—నాకు ధర్మానురక్తిగాక వదురుబోతుతనము కూడా ఉన్నదని ఒప్పుకుంటాను. నాకు యుక్తులు మాత్రమే తోచవు.

హరి—అదే మా టంటున్నారే? యుక్తు లెందుకయ్యా ? వ్యక్తృత్వ ముండవలెను కాని. అద్వితీయమైన



శక్తి కలిగియుండీ మీ రతివినయము పూనియుండడ మత్యాశ్చర్యకరమే.

విహా—గుణగ్రహణపారీణులు మీ రున్నారు కాబట్టి నాలోతు నెరుగగల్గినారు, అదే నాకు సంతసము కూర్చినది.

హరి—నేనా? ఏదో తమబోటి వివేకవంతుల సాంగత్యమువల్ల నాల్గుముక్కలు నేర్చుకొన్నాను, కాని నాకు స్వతఃపాండిత్య మేపాటి? మీవంటివారికీ నాకూ హస్తిమశకాంతరము తేడా యున్నది.

విహా—అలా గంటా రేమి ? ఆ సంస్కర్తశాస్త్రుల వారి నోరవలీలగా మూయించలేదా ? "పతి" శబ్దమునకు మీరు విపరీతార్థము చేసినారు కావుననే మనకు జయము చేకూరినది.

హరి—అదంతా మీ సహవాసమున అబ్బినదే. పురుషుడు భార్య చనిపోయినపిమ్మట బ్రహ్మచర్యము సల్పగల్గినప్పుడు స్త్రీమాత్రము తనపతి గతించిన యనంతరము బ్రహ్మచారిణిగా నుండకూడదా అనే మీవాదము నావాదమును పోషించింది, లేకుంటే నావాదమునకు బలమేదీ?

విహా—ఇతరహేతువులన్నీ పూర్వపక్షము లయినందువల్ల నేను దానిమీదనే ఆధారపడవలసివచ్చినది. ప్రాచీన ధర్మసూత్రములలో పునర్వివాహమున కాధార ముండదని ఒప్పుకొనకతీరదు. "పతి" శబ్దముకు మీరుచెప్పిన అర్థము

వితండవాదము. మనలోమాట. మీ రదొప్పుకొందురా లేదా?

హరి—నిజమే. నేనుచెప్పిన అర్థ మనర్థమే. కాని యుక్తులుతోచనప్పుడు ఇట్టి విపరీతవ్యాఖ్యానము లేచేస్తూ మన వాదము క్రిందైనదంటే "శేషం కోపేన పూరయేత్" అన్నట్లు గుడ్లెర్రచేసి బల్ల గుద్ది పళ్ళు బిగించి ఎదుటివారిని తిట్టడము ప్రారంభిస్తేనే కాని సభకట్టు కానేరదు. నేడు నేను చేసిన అల్లరి చూడగానే సంస్కర్త లడలిపోయినారు చూచినారా? ఇదే సమయస్ఫూర్తి. ఇట్టి వేషమూ, విడంబనమూ కొన్ని వేళల కార్యకారి కాగలదు.

విహా—మీ ర ర మ ర లేక మాటలాడుతూన్నారు. కావున నా విజయరహస్యముకూడా చెప్పతూన్నాను. నే నుపన్యాస మారంభించిన కొద్దికాలములో కరతాళములు లేకుండేనా, వెంటనే మాతృదేశమూ, ఆర్యభూమి, సనాతన ధర్మము, ఋషులూ మొదలయినవి శరంపశరముక్రింద అవ తరింపజేసి మనపూర్వుల గొప్పను ప్రశంసిస్తాను. వెంటనే పడపడమని కరతాళములు బయలుదేరును. ఇంకా గొప్ప గోల పుట్టించవలెనంటే రాణాప్రతాపసింహుడు, శివాజీ, మొదలైనవారిని బైట కీడ్చేటప్పటికి గోల అయితీరును. వారిపేర్లు తీసుకొనిరావడము కొంతవరకూ అప్రస్తుతప్రశంస అవుతుంది కాని నా. ఉపన్యాసమునకు మాత్రము పేరు వచ్చి తీరుతుంది. ఆ మహానుభావులు జీవించియున్నప్పుడు మన



మాతృభూమికి వన్నె తెచ్చినదేకాక మన ఉపన్యాసములకు కూడా మెరుగుపెట్టుతూన్నారు గనుకనే వారు జీవన్మృతు లన్నమాట సార్థకమయిందని నా యూహ.

హరి—సరే. ఇదటుంచి ప్రస్తుతాంశము నెత్తుకొం దాము. చకోరుడు దేశాంతరమునుండి తిరిగివచ్చెను కదా వారి కుటుంబమును వెలివేయవలెనా లేదా?

విహా—అది స్థిరమే. బహిరంగసభను గూర్చి ప్రక టించినానే.

హరి—ఈ వ్యవహారము మా మరదలికి తెలియ కూడదు సుమండీ.

విహా—తెలిసినా ప్రమాదము లేదు. నేను మా నాన్నవలె మట్టిబొమ్మను కాను. సంస్కర్త లాడవారిపై మిషపెట్టి ఆచరణమున తప్పుకొందురు. మనము కూడా ఆలాగే చేస్తే వారి నాక్షేపించడ మెందుకు?

హరి—పునరుద్వాహవిషయమున మీరు దృఢ నిశ్చయు లయినట్లే కేశఖండనవిషయమున కూడా రూఢాభి ప్రాయు లయితే బహుబాగా ఉండును. ఇప్పుడింకొక ప్రమా దము సంభవించునేమో అను సందేహము కల్గుతూంది. చకోరుడు తిరిగి వచ్చినాడు కావున చంద్రికవిషయమున మీ రుపేక్షించకూడదు. ఇదివరకు నామాట త్రోసివేసినారు కాని, ఇప్పుడు కూడా అట్లే చేసితిరా ఏమిగొప్పసంకటము ప్రాప్తించునో కొంచె మాలోచించండి.

విహా—ఈవిషయమున మీ మాటలన్నీ నిజమనేనా మీ యూహ?

హరి—నేను చెప్పనేల? మీరు సావధానముగా పర్యాలోచన చేస్తే మీకే అవి నిజమని తోచగలదు. పతి గతించినపిదప పత్ని తలపై జుట్టున్నన్నినాళ్ళు అతడు నరకమున కూలియుండునని మనశాస్త్రములే ఘోషిస్తూన్నవి.

విహా—ఇవన్నీ తెలివితక్కువవారిని బెదిరించడమునకే కాని వివేకులచెంత కొరగావు. మన స్మృతులు మాత్రమన్నీ ఒక్కలాగున్నవా? మీవాదమును ఖండించే ప్రమాణము మనస్మృతులయందే ఉన్నది. వితంతువు తలపై నొక్క వెండ్రుకైనా ఉంటే ఆమెపతి స్వర్గమున కాలు పెట్టజాలడని కదా మీ వాదము? అట్లే జరిగినట్టయితే భగవంతుని న్యాయపరిపాలన మెంత పరిహాసాస్పదమో ఆలోచించండి—ఎంత పుణ్యపురుషుడైనా స్వర్గమునకు బోకుండా జేసేది వితంతువు తలవెండ్రుకా? సరే. పత్ని వెండ్రుకలన్నీ ఖండించినట్టయితే పతి యెట్టివాడైనా స్వర్గమునకు పోగలుగునా? ఆలాగైతే మంగలివాళ్ళ రొట్టె నేతిలో పడుతుంది.

హరి—పోనియ్యండి—పతివిహీన నందకత్తెగా నుంచినట్టయితే ఆమె శీలమునకు భంగము కల్గవచ్చునని ఒప్పుకొందురా లేదా!

విహా—సరే కాని, మంగలివాళ్ళు పేలుడుగాయలనిన్నీ లోకములోని భోగట్టాల నొకరినుండి తెలుసుకొని



యింకొకరితో చాటుతూందురనిన్నీ మీ రెరుగుదురు కదా? అట్టివారితో ఏకాంతమున అరమరలేక ప్రసంగించడమున కవకాశము కల్గనిచ్చినందువల్లనూ వాళ్ళు తమ శరీరము నంటునట్లు చేయుటవల్లనూ శీలమునకు భంగము కలుగదా? వితంతువులను వికారాకారులను చేయవలె నంటే జుట్టు తీయుటకన్న ముక్కూ చెవులూ కోయడమో కళ్ళు పొడిచివేయడమో మేలు కాదా? ఒకసారి తీసిన తరువాత వెండ్రుకలు తిరిగీ మొలుచును—ముక్కూ చెవులూ మరి పెరుగవు, పోయినకళ్ళు మరి రావు.

హరి—మీరూ వితండవాదము చేస్తున్నారే! మీ అభిప్రాయము లతిచిత్రముగా నున్నవి—కొన్ని విషయములలో సనాతనధర్మము ననుసరిస్తారు, మరికొన్నిటిలో దాన్ని నిరసిస్తారు. పూర్తిగా సంస్కర్తలూ కారు; పూర్తిగా పూర్వాచారపరాయణులూ కారు.

విహా—శాస్త్రిగారూ, స్వబుద్ధి కేది ఉత్తమమని తోచునో దాని ప్రకారము నడుచుకుంటాను—నాప్రత్యయమే నాకు ప్రమాణము—మా చంద్రికగొంతుక కోసినందు కా ముసలితొత్తుకొడుకు నరకమున కుళ్ళవలసినదే—మహాపాపికి తగినశాస్తి కావద్దా? (తరంగిణి వచ్చును)

హరి—అదిగో మరదలు వచ్చినది.

తరం—నేడు నేనొకమాట విన్నా నది నిజమేనా? చకోరునికి వెలి యట, ఔనా?

విహా—మా ప్రసంగము నీవు పొంచియుండి వింటూన్నావో లేదో చూడవలెనని పరియాచకమునకు శాస్త్రి గారితో నన్నాను.

తరం—పొంచియుండి వినడ మెందుకు? నేటి వార్తా పత్రికలలో ప్రకటన యున్నదే—ఇంక కావలసిన దేమిటి?

విహా—వార్తాపత్రిక లేవీ మనయింటికి తేవద్దని నేను కట్టడి చేసియుంటే నీ కా పత్త్రిక ఎట్లు దొరికింది?

తరం—మన యింటికి రాకుండా మీరు చేయగలరు గాని దేశమంతాటా అవి ప్రసరించకుండేలాగు మీరు చేయగలరా?

విహా—సరిగాని, నీచేతి కదెట్లు వచ్చింది?

తరం—బజారునుండి పంచదార తెప్పించినాను, అది కట్టిన పొట్లముకాగితములో నీమాట కనబడ్డది.

హరి—అప్పుడే వార్తాపత్రికల దాకా ప్రసరించిందా ఈ మాట?

తరం—శాస్త్త్రిలుగారూ! ఇది మీ పనేనా?

విహా—మంచిపని ఎవరు చేస్తే నేమి?

హరి—మన మాతృభూమిని దాటినందుకు మన శాస్త్రములలో ఇదే ప్రాయశ్చిత్తము విధించబడినది.

విహా—ఆ శాస్త్రమునందు నాకు విశ్వాసమంతలేదు. నూతిలోని కప్పలవలె మనము మనదేశమందే కూర్చుండే దినములు గతించినవి—దేశాంతరముల కేగి విద్య నభ్యసించి



ఆయాజాతులవారి నాగరికత పరిశీలిస్తేనే కాని మన దేశము బాగుపడదు.

తరం—అట్లయిన చకోరు డొనర్చిన నేర మేమి? వానికి వెలి యేమి?

విహా—పరదేశముల కేగినవాళ్ళు మనం దేశాచారములు మాని మనభాషను కూడా మరచిపోయి విదేశాచారముల నవలంబించినందున మన దేశమునకు చాలా నష్టము కల్గుతూన్నది.

తరం—చకోరు డట్టి వెర్రివేషములు వేసేవాడు కాడు, వెర్రిచేష్టలు చేసేవాడు కాడు. వాని కెందుకు వెలి?

విహా—వాడు జపాను పోకపూర్వము చంద్రికను వానికిచ్చి పెండ్లిచేయవలెనని నిశ్చయ మయినది జ్ఞాపకమున్నదా?

తరం—ఇప్పు డాసంగ తెందుకు? అది కాకుండానే మాయపెళ్ళి ఒకటి దాపురించి ఆమెగొంతుక కోసిందిగా?

విహా—దానివల్ల నిప్పుడు గొప్పముప్పు మూడింది. వాని కీకథంతా తెలిసిన పిదప వాడు మనచంద్రికను పునర్వివాహ మాడవలెనని పట్టుబట్టినాడట—వాని కావెర్రి కుదుర్చడమునకు వెలివేయడమే మందు—అంతతో విరక్తిచెంది పెళ్ళిమాట తలపెట్టడు.

తరం—ఈ యాలోచన మీకు తోచిందా, లేక శాస్త్త్రిలుగారు నూరి పోసినారా? వాడివెర్రి మాటకేమి

కాని మీది వెఱ్ఱి ఆలోచనని స్పష్టమే. పునరుద్వాహము చేసుకోవడమునకు తెగించినవాడు వెలికి వెరచునా? మీరు వేసే వెలి విపరీతముగా పరిణమించి తీరుతుంది—వానిపట్టుదల మరింత గట్టిపడి అమ్మాయిని వాడు వివాహము చేసుకొని తీరును. వాళ్ళ సంగతి మీ కింకా తెలియదు. వాళ్ళ మనోనిశ్చయము మరలేది కాదు. వాళ్ళు ధీరులు, విపత్తులను లక్ష్యపెట్టరు—వారి ధైర్యము కుంగదు, వారి సాహసము విఘ్నములను సరకుచేయదు.

హరి—మరదలు పరేంగితజ్ఞానపారీణ వలెనే మాట లాడుతూన్నదే!

విహా—వారి చిత్తవృత్తి మీ రింతలోనే మరచినారా? ఆశ్రమమును వాళ్ళు స్థాపించినప్పుడు మీ రెన్ని ప్రయత్నములు చేయలేదు దానిని పడగొట్టవలెనని? అందువల్ల వా ళ్లేమైనా జంకినారా? పట్టుదల విడిచినారా? తుద కెవరికి జయ మబ్బింది?

విహా—కావచ్చును. నా పట్టుదల మాత్ర మంత బిగువైనది కాదనుకొంటున్నావు కాబోలు? నీ వన్నట్లు వాళ్ళదే జయమైనా నా ప్రయత్నము నేను విడునను-చకోరుడు వెలికి వెరచేవాడు కాకున్నా వానిని వెలివేయగానే మాచంద్రిక వానిఊసు తలపెట్టదు, నాకు కావలసిన దంతే.

తరం—మీచంద్రిక బాగుంటే మీకు చాలును, నా సోదరుని బహిష్కరించినట్టయితే నా ప్రాణములు నిల్వవు-



నేను గతించిన తరువాత మీ చిత్తమువచ్చినరీతిని వానిని హింసించండి. చకోరు నిపుడూ, జుట్టున్నందుకు మీచెల్లెలిని మరికొన్నాళ్ళకూ వెలివేయండి-ఆపై నింకొకరిని...మీవరుస చూడ నాయందు దయతప్పినట్లున్నది-మేమంత వెగటుగా నుంటే మీ నాన్నగారివలె చిన్న భార్యను పెండ్లాడి సంసార సుఖ మనుభవించండి.

విహా—బాగు బాగు-నీవంటే నాకు వెగటా? ముల్కుల వంటి పల్కు లాడుతూన్నావు-ఇదివర కెన్నడూ పల్లెత్తు మాట అని యెరుగవు. ఇప్పు డింత విరసంపుమాట లాడుతూన్నా వేమి?

తరం—మగవారి కేమి మహారాజులు-ఒకబట్ట మాస్తే రెండోబట్ట కట్టుకొన్నట్లు ఒక భార్యపై రోత పుట్టినట్లయితే ఇంకొకర్తె, అది పోతే మరొక్కర్తెనూ చేసుకోగలరు. ఎంత మందిని చేపట్టినా ఏమీ అనేవా రుండరు.

విహా—ఇదా నా నైజము నీవు కనిపెట్టినది? నీవు పోవద్దు, నే నింకొకర్తెను కట్టుకోవద్దు. మా నాయనగారిని నాకు సాటితెచ్చినావా? అంత పని పుట్టకనేపోవలెను; ఒక వేళ నా కా దుర్గతి పట్టినదంటే బ్రహ్మచర్యము నాచరిస్తాను కాని ఇంకొకర్తెను కట్టుకుంటానా? ఇదుగో ఒట్టు పెట్టుకుంటాను. నీవు గతించినట్టాయెనా నేను పెళ్ళిచేసుకోను. ...బ్రహ్మచర్య మాచరించడ మొక బ్రహ్మాండము కాదు,

ఈ సబబుచేతనే నేటిసభలో పునర్వివాహావాదములో సంపూర్తిగా జయము పొందినాను.

తరం—భార్యా ఉన్నన్నాళ్ళందరూ ఇల్లే శపథము చేయుదురు, కాని మాసికము పెట్టినవెంటనే మరియొకర్తె కోసము ప్రయత్నము చేస్తారు, మనము చూడలేదా? దానికేమిగాని, చకోరుని వెలివేయడమునకు సభ మానితే మీకు నామీద అభిమాన మున్నట్లు లేకుంటే లేనట్లూ భావిస్తాను. మాట!

విహా—అసాధ్యపుకోరిక గోరితే నే నే మనగలను? నోటీసులు పంచడ మయింది, ఇంక నాచేయి జారినది. విల్లు నుండి అమ్ము విడువబడినది. ఈసంగ తిదివరకే నీవు చెప్పియుంటే నీమాటచొప్పున నడచుకొనియుందును.

తరం—నాకీవిషయము తెలియనీయకుండా ద్వారములన్నీ బంధిస్తే నా కదేలాగు తెలుస్తుంది?...దానికేమి, ప్రకటన బ్రహ్మవ్రాసినవ్రాత కాదుగదా? రెండో ప్రకటన వల్ల మొదటిది రద్దుచేయవచ్చును.

విహా—సరేకాని, సభ మానడానికి కారణమేమి?

తరం—ఈపాటి కారణము నేను చెప్పవలెనా? నాకు జబ్బనండి.

విహా—నాకు జబ్బుగా నున్నదందునా? అది బలవత్తరము.

తరం—అలాగే కానీయండి, హాయిగా పక్కమీద



పరుండండి. కాని అంతతో సభ ఆగిపోతుందా? ఇంకెవరైనా జరుపుతే?

హరి—మరచలా, ఈసభ కబ్బాయిగారే సూత్రధారి. అతడు లేకపోతే పని జరుగదు. నాదమునకు తగినంత ప్రమాణము తయారు కాలే దనవచ్చును. వచ్చేవారము సభ చేతా మందాము.

విహా—ఇది బాగుంది, అల్లే ప్రకటిస్తాను (తరంగిణి పోవును)

హరి—ఈమె నాగానే మిమ్ము వెనుకకు లాగునని అనుకొన్నాను. సరే-ఆమెమాట జరపడ మావశ్యకమే. మీ కామెయందు గాఢానురాగ ముందని విశద మవుతుంది.

విహా—ఒక్కొకప్పుడు వాళ్ళమాట వినకతీరదు. లేకుంటే కలహము సిద్ధము: గృహచ్ఛిద్రము లంటే ఇటువంటివే.

---

—నాలుగో రంగము, ఆనందరావిల్లు.—

వేణమ్మ.

వేణ—నన్నిక్కడ కాపుండుమని ఆ చండాలుడమ్మగారికి పురాణము చెప్పడానికి లోనికి వెళ్ళినాడు. ఏమి దురంతము జరుపునో? స్త్రీపురుషు లెవరైనా ఒకసారి పెడదారిని పడ్డారంటే ఇక నంతే. పగిలిన గాజుపెంకునైనా

అతకవచ్చును కాని పరువుపోతే దానిని తిరిగీ సంపాదించడము కష్టము. వ్యభిచారరీతి నొక పురుషునికీ స్త్రీకిన్నీ సంబంధము కలిగినట్లైతే ఆ గోతులో కితరులను కూడా లాగవలెననే వాళ్ళు యత్నిస్తూందురు. తాచెడ్డకోతి వనమెల్ల చెరుపును.....చీ, ఛీ, ఎరిగి యెరిగీ యిట్టి దురాచరణము చేయనా? వద్దు, వద్దు. నేను చెడినదే చాలును, పాప మా యిల్లాలిని పాడుచేస్తానా? తప్పు.

(వెళ్ళును)

హరిహరశాస్త్రి—సరస్వతి.

హరి—ఈ ప్రకారంగా గోపికలందరూ స్నానాలు చేస్తూండగా శ్రీకృష్ణభగవానులు వాళ్ళ చీరెలన్నీ అపహరించి కదంబవృక్షముకొమ్మలకు కట్టివేసి, ఆ చెట్టుమీద కూర్చుండి మనోహరముగా మురళీనాదము చేయ మొదలుపెట్టెనట. ఆ వేణుగానము విన్నతోడనే గోపికలందరూ ఒడ్డుకి వచ్చి తమ చీరెలను వెదకుకోగా అవి కనపడవాయెను. ఒక్కసారి అన్నిచీరెలూ మాయమాట జూచి యిదంతా భగవద్విలాసమే అని నిశ్చయించి శ్రీకృష్ణమూర్తివారున్న చెట్టుదగ్గరకు వచ్చి దీనస్వరముతో ఆమహామహుల నీలాగు ప్రార్థించినారట. "హా కృష్ణా, దీనబంధూ, నీశరణు జొచ్చినాము. నీకు దాసులము. మా చీరెలు మాకిచ్చి మామానము కాపాడవలసినది." ఇట్లు గోపికలంద రేకగ్రీవముగా మొఱపెట్టేసరికి శ్రీకృష్ణమూర్తివారు వాళ్ళయెడ ప్రసన్నులై



"సుందరీమణులారా! కాత్యాయనీవ్రత మాచరింపబోయి మీరు దిగంబరులై స్నానము చేస్తూన్నారు. అది మహాపాతకము కాబట్టి తత్పరిహారార్థమై రెండుచేతులూ పైకెత్తి మూడుసారులు నమస్కరించి రట్టాయెనా మీ పాపము పోవును—" అని ప్రత్యుత్తర మిచ్చినారట శ్రీకృష్ణమూర్తి వారు—

సర—శాస్త్రిలుగారూ, సిగ్గుమాలినపని ఒకటి చేసినప్పుడు తత్పరిహారార్థ మింకొక సిగ్గుమాలినపని చేస్తే ఆపాపము పోవునా?

హరి—ఆహా! మంచిప్రశ్న వేసినావు! దీనికి సమాధానము నేనొక దృష్టాంతపూర్వకముగా యిస్తాను. నా మిత్రుని కొకనికి పొగతాగే దురలవా టుండేది. అ దేలాగు తొలగునా అని వాడు విచారిస్తూండగా ఒక దురభ్యాసము రెండో దురభ్యాసమువల్ల తొలగుతుందని నేను చెప్పినాను. అత నంతట మద్యపాన మారంభించెను. కొన్నాళ్ళకు పొగాకు వదలిపోయి మద్య మభ్యాస మాయెను; తుదకు దానివల్లనే అతనికి మృత్యువు సంభవించినది.

సర—గోపికలస్థితి కూడా అలాగే అయింది.

హరి—(స్వ) నే డీమె చాలా ప్రసన్నముగా నుంది, నేను బయలుదేరిన వేళ మంచిదనే తోస్తుంది. (ప్ర) నగ్నముగా స్నానముచేసిన పాపమును, ఆస్థితిలోనే చేసిన నమస్కారములచేతనూ, నమస్కరించిన దోష మింకోవిధమున

వాళ్ళ ననుగ్రహించడము చేతనూ పరిహరించినాడని భాగవతమం దతిస్వారస్యముగా వర్ణింపబడ్డది-

సర—శ్రీకృష్ణపరమాత్మ యిటువంటి దుష్టచేష్టలు చేసినాడంటే నమ్మడానికి వీలులేదు. పరమపవిత్రుడైన ఆ మహామహునికి ఇటువంటి దుర్బుద్ధి ఎట్లు పుట్టును? గోపికలయం దత్యంత వాత్సల్యము గల మహాత్ముడు వాళ్ళ నీలాగు వంచించునా? ఇట్టి దుష్కార్యములు చేసేవాడు పరమపవిత్రుడెట్లు కాగలడు? అతని నామోచ్చారణముచేత సర్వపాపములూ హరించును కదా అటువంటి శుద్ధచారిత్రు డీరీతి నాచరిస్తాడంటే నమ్మడానికి వీలులేను. ఈ కథ కింకేదో గూఢార్థ ముండితీరవలెను.

హరి—విద్వాంసు లనేకులు పెడర్థములు దీనికి తీసినారు కాని రసికుల కాయర్థము లింపుగా నుండవని నేను నీకు చెప్పలేదు.

సర—ఔను. శృంగారరసోపాసకులకు వైరాగ్యమార్గము రుచించదు.

హరి—నా మనసులోమాట ఎంత నిపుణముగా చెప్పినావు:

సర—ఇదే నిజమైతే శ్రీకృష్ణభగవానులు గోపికలయెడ నొనర్చిన మహాపరాధమునుండి విముక్తు డౌట ఎట్లు?

హరి—ఇక్కడొక చిన్న ధర్మసూక్ష్మ మున్నది. గోపికలు భక్తులు, అట్టివాళ్లు భగవంతునితో రమించడము



పాపహేతువు కాదు. జీవబ్రహ్మైక్యమే కదా వేదాంతమునకు పర్యవసానము?

సర—ఇట్టి ఐక్యము ఆత్మలకి కదా సంభవించవలసినది?

హరి—ఆత్మల కైక్యత అలవడినప్పుడు శరీరముల కైక్యత కలుగదని నీ సందేహము-దానికి సమాధానముంది- ఆత్మైక్య మత్యుత్కృష్టము, కావున మొట్టమొదటనే దానిని సాధించడము కష్టము కాబట్టి శారీరకైక్యము ముందు సాధించి దానిమూలాన ఆత్మైక్యత సంపాదించవలెను.

సర—మీ మాట లతి చిత్రముగా నున్నవి-స్త్రీలు చెడుమార్గమున నడవడము చేటుకాదని మీ అభిప్రాయము కాబోలు?

హరి—అదికాదు నేనన్న మాట-గొప్పవారితోడి సంబంధము కొరగానిపని కాదు. దీని కెంతో దూరము పోనక్కరలేదు. మనదేశమందే కొన్ని ప్రదేశములలో కొద్దివారు గొప్పవారితో శారీరకసంబంధము చేసుకోవడము పుణ్యప్రదమైనదని భావిస్తూన్నారు?

సర—ఇది నే నెరుగను-గొప్పవారంటే ఎట్టివారు?

హరి—గొప్పవారిలో మొదటివారు దేవతలు, తరువాత గురువులు, అనగా ధర్మోపదేశము చేసేవారూ, విద్య చెప్పువారున్నూ ఉత్తమ గురువులు.

సర—గురుపత్నితో సంబంధము కలిగిన చంద్రుడు ద్రోహి కావడముచేత అతనికి శాపము వచ్చింది. అట్లే

యింద్రునితో సంబంధము కలిగినందుకు అహల్యకు శాపము వచ్చింది. ఇట్టి కృత్యములు పాపకలితములని విన్నాను, కాని పాపరహితములని వినలేదు.

హరి—ఇదొక ధర్మసూక్ష్మము. ఇట్టివి నీకు బోధించడానికే పంతులుగారు నన్ను నియోగించినారు.

సర—మీరేదో మసిపూసి మారేడు చేసినా బుద్ధిశాలియైన గురు విట్టి పాపకృత్యముల కొడబడునా?

హరి—ఒడబడినంతమాత్రాన చాలునా? అతడు యోగ్యుడు కావలెను, జ్ఞాని కావలెను. అట్టివాడేకాని నిష్కామ్యకర్మ చేయడమున కర్హుడు కాడు.

సర—(స్వ) మనోహరరావుగా రీతనిని పంపియుందురా? (ప్ర) అయ్యా, ఎవరైనా మీద్వారా యీ వార్త పంపినారా?

హరి—ఇట్టివార్త లొకరిచేత నెవరైనా పంపుదురా? నా సంగతే నేను చెప్పుకొన్నాను-ఆ పైని నీ చిత్తము.

సర—మీకే పుట్టిందా ఈ పెడబుద్ధి? మీ రేమో యోగ్యులని మావారు తలచి యింటికి రానిచ్చినారు? ఇంత నీచులని తెలిస్తే మిమ్ము గెంటించి యుందురు. ఇప్పుడైనా మించిపోలేదు.

హరి—నావల్ల తప్పు వచ్చినది. ఈసారి క్షమించండి. ఇంకెప్పుడూ ఇల్లు చేయను.

సర—ఇప్పటినుండి మాయింట కాలుపెట్టనని ప్రమాణము చేస్తేనేకాని ఈ దురాచారము బైటపెట్టక మానను.



హరి—అలాగే చేస్తాను కాని పంతులుగారితో మీ రేమి చెప్పదలచుకొన్నారు?

సర—మీకేమీ ప్రమాదము రాకుండానే చేస్తాను, ఈక్షణమే పొండి.

హరి—ఇంక మీయింట కాలుపెట్టను, దైవమే సాక్షి (పోవును)

వేణ—అమ్మగారూ, పంతులుగారు వస్తున్నారు. (అతడు వచ్చును)

ఆనం—హరిహర శాస్త్రి ఏడీ?

సర—అధిక ప్రసంగము చేస్తే ఆవలికి పొమ్మన్నాను.

ఆనం—బలే. పాతివ్రత్య మంటే యిది. నాకిప్పుడే మనోహరరావు వ్రాసిన ఉత్తర మందినది. అందాతడీ శాస్త్రిని గూర్చి విన్నకొన్ని అల్లరిమాటలు వ్రాసెను. అతని నింటినుండి గెంటివేయవలెనని యిక్కడికి వచ్చినాను. నేను రాకముందే నీ వాపని చేసి నావిశ్వాసమునకు తగిన పాత్రమైనావు.



— ఐదో రంగము —

హరిహరశాస్త్రి, వేణమ్మ

హరి—నీ మూలముగానే నా ప్రయత్న మంతా పాడయింది.

వేణ—పాగా చుట్టలేక బుర్ర వంక అన్నట్లుంది.

హరి—నీవు దానికి సరిగా బోధపరచి యుండకపోవడము చేతనే వ్యవహార మంతా చెడింది.

వేణ—మీపాచిక అంతటా పారదని యిప్పటికైనా విశ్వాసము కలిగిందా?

హరి—కలుగ కేమీ? ఇంట నడుగు పెట్టవద్దన్నది, కొట్టడమే కొదవచేసింది.

వేణ—మీరు మాటలాడిన దెంతసేపు వ్యవహారము ముదరడానికి?

హరి—నీవు రాకముందు మూడునాలుగు నిమిషముల క్రిందటనే జరిగింది మా ప్రసంగము.

వేణ—నే ననుకొన్నది నిజ మయిందన్నమాట.

హరి—ఆమె మన మందలో చేరేది కాదని నీకు తెలిసినప్పుడు వాతో యెందుకు చెప్పలేదు? నా కవమానము కావలెనని చేసినావా?

వేణ—అదికాదు. నే నింట్లో నున్నానని మీ మీద కోపమువచ్చినట్లు నటించింది, అంతే. ఇంతతో మీరు నిరాశ చేసుకోవద్దు.



హరి—నీ మాట నిజమే కావచ్చును. ఈ మాట పంతులుగారితో చెప్పవద్దని నే నంటే నవ్వుతూ అందుకొన్నది. నిజముగా దానికి కోపమే వచ్చినట్లయితే ఇల్లంతా గోలపెట్టదా?...సరేకాని, పానకములోని పుడకలాగు నీ వెందుకు వచ్చినావు లోపలికి?

వేణ—మీమీద గొప్పకుట్ర జరిగింది. (చెవిలో చెప్పును)

హరి—ఓహో! అలాగా? ఆనందరావుగారు నా కర్ధచంద్రప్రహారము లివ్వదలచినారా? ఆతనిభార్యా ఇంకొకని మరిగిందేమి? మనోహరుడా నాకు ప్రతికక్షి? నే నిక్కడ ఉంటే తనయాటలు సాగనివ్వనని నన్ను చతురతతో తొలగించినాడు. సరే. వానిమీద నొక కన్నువేసి ఉంటాను. వాడిచేతిలో నీమె పడకముందే నేను వశపరుచుకొంటాను... ఈ క్షణమే సరస్వతికి మోహాలేఖ వ్రాయవలెను. ఆలస్యాదమృతం విష మన్నాడు. భీరునిచేత దాని నాహా కందచేస్తాను.






# మూడో అంకము

## —1 మొదటి రంగము 1—రోడ్డు

హరిహరశాస్త్రి

హరి—ఉత్తరము పంపి రెండు రోజులయింది, జవాబింకా రాలేదు. భీరు డేమైనా విశ్వామిత్రము చేసినాడా? వాడలాటివాడు కాడే? వాడి చేతిలోనుండి లేఖ నెవరైనా హరించియుందురా?

(భీరుడు వచ్చును)

భీరు—పనులన్నీ చక్కబెట్టేసరికి పొద్దు గుంకింది, చీకటి పడ్డది-మాపొరుగిల్లు దయ్యాలకొంప, ఆ యింటావిడ నూతిలో పడి చచ్చింది మొదలు ఆ యింటివారినే కాక ఆ దారిని పొయ్యేవారి నందరినీ బాధిస్తూన్నది...(దద్దిరిల్లి) ఏమి టీచప్పుడు?...కాదుకాదు, ఇది నా చెప్పుల చప్పుడే-(చెప్పులు చేత బట్టుకొని) 'రానీ, ఆ దయ్యము నాయెదుట బడితే ఎడాపెడా చెప్పుజోడుతో వాయిస్తాను-దెబ్బకి దయ్యం దడుస్తుంది...అదేమిటి బాబో-దయ్యమే (గడగడ వణకి



చెప్పులు జారవిడిచి కళ్లు మూసుకొనును) ఇంకొక్కడుగైనా ముందుకి వేయను.

హరి—ఓరీ! భీరూ!

భీరు—అయ్యోబాబో! నా పేరేలాగు తెలిసింది దీనికి?

హరి—ఏమిరా, అంత బెదరు?

భీరు—దయ్యముకాదు శాస్త్రిల్లుగారు. ఏమంటారు?

హరి—అంత భయమా? ఓరి పిరికిపందా!

భీరు—భయ మెవరికి? నాకా? మీకా?

హరి—ఈ ప్రదబాయింపుల కేమికాని...ముందు చెప్పులు తొడుగుకొని చెమట తుడుచుకో...జాబు అమ్మగారి కంద జేసినావా?

భీరు—నన్నూరకే పిరికివాడంటే ఒప్పుకోను-దానికి ముందు కారణం చెప్పవలెను.

హరి—సరే-దీని కేమిగాని ఉత్తర మేమి చేసినావు?

భీరు—మీ రిమ్మన్నవారికే యిచ్చినాను.

హరి—ఆమె చదువుకొని ఏమి చేసింది? మారుత్తర మిచ్చినదా?

భీరు—అది చూడగానే మూతిముడుచుకొని మెటికలు విరిచి జవాబు పంపడానికి మీరు తగినవారు కారని కోపముతో నన్ను కసరి పొమ్మన్నది. అందులో కూడని మాట లేమైనా వ్రాసినారామీరు?

హరి—నీకెందు కాగోల? పో...(వాడు వెళ్ళును)... ఏమీ! ప్రత్యుత్తరమునకు నేను తగనా?...కూటికి తక్కువైతే కులానికి తక్కువా? కానీ, నాప్రతాపము చూపుతాను...దీనికి బుద్ధిచెప్పడానికి దీని బంధువునే వలలో వేసుకొని నాకామాగ్ని చల్లార్చుకొంటాను. సరస్వతిని వశపరచుకో లేకున్న మానె, చంద్రికను చేజిక్కించుకొనలేనా? వితంతువులను సులభముగా వశపరచుకోవచ్చును-వారికి పతి భీతి లేదు. పరుల బిడియ ముండదు. ఈ విషయమున వేణమ్మ తార్కాణము. చకోరుడు చిక్కకుంటే చంద్రికకెదుట నున్నవాడే పెళ్ళికొడుకు...ఇంకో విధాన సరస్వతిపై కసి తీర్చుకోవచ్చును. దాని మాటలయందు కొంచెము ధ్వని యున్నది. అది నాతో "మి మ్మెవ్వరైనా పంపినారా" అని యడగడము చూస్తే అది మనోహరరావుని వలచి యున్నట్లు స్ఫురిస్తూన్నది. అందుచేతనే వాడు నన్నక్కడ నుండనివ్వలేదు. ఈ మనోహరుడే నా కడ్డుతగిలినాడు...వీడున్నంతకాల మది నావైపు చూడదు, కనుక వీడిని ఈ యూరినుండి వెడలగొట్టవలెను...వీడు సంఘసంస్కర్తగా నుండి ఊళ్ళోవారందరికీ యిష్టుడుగా నున్నాడు, గనుక బైట పంపడము మంచియాలోచన కాదు. నరకమున కంపడమే తగినపని. వీడు గతించిన తరువాతసరస్వతి సధవయైనా విధవయైనట్లే. వ్యభిచారబుద్ధి పుట్టనేకూడదు కాని పుట్టిన తరువాత బూడిదైతేనే గాని పోదు. అప్పుడు నాపాచిక



పారిందా సంపూర్ణజయము లభించిం దన్నమాటే, లేదా కసి తీరుతుంది. అదీ నాకు జయమే...కావున ఇక మనోహరుని మట్టిచేయవలెను. జాగు మెందుకు?...(పోవును)

—(రెండో రంగము)—ఆనందరావు ముంగిలి

చకోరుడు

చకో—నా కీవేష మనుకూలముగా నున్నది. శోకాశ్రుబిందువులను బోలు అక్షమాల, అనురాగమును పోలిన వసనరాగము, ప్రేమయాచించుటకు భిక్షాపాత్రము! బళే- నా శారీరకవ్యవస్థ మానసికవ్యవస్థతో పూర్తిగా మేళవించి యున్నది...ఇక నేను చంద్రికయున్నచోటికి పోవలెను. ఈ భవంతిలో ఆడంబరముతో గూడిన యీభాగ మానంద రావుగారిదై యుండును. వయస్సున ముసలివాడైనా పడుచు పెళ్ళామును చేసుకొనుటచేత యింటిలోనైనా నిత్యకళ్యాణముగా నుంచి ఆమె ముద్దు ముచ్చటలు తీరుస్తున్నాడు... అదే విహారుని భాగము. అదిగో అంగణములోని తులసీ బృందావనము...ఇచ్చట నే నెంతకాలమో చంద్రికతో కలిసి యాటలాడుతూంటిని. అన్యోన్య సరాగముగా నెన్ని తడవులో సంచరించిన ఈచోట నేడు విరాగివేషమున నుండ వలసివచ్చెనుకదా! అదిగో పారిజాతవృక్షము, దీనిని చూడగానే నాకు గతవిషయములన్నీ జ్ఞప్తికి వచ్చి దుఃఖము పొంగి పొర్లనున్నది. ఈజాజిపూవుల నెన్నోసారులు చంద్రికజడ

యందూ వేలుముడియందున్నూ తురుముతూంటిని. ఆదినములలో చంద్రిక దరవికసితమైన పుష్పకళికవలె శోభాయమానముగా నుండెను, కాని హతవిధివిలసనముచేత ఆమొగ్గ నేడు వాడి కాంతిహీనమై యుండునుకదా? ఈ గులాబి పువ్వులపొడితో నామెనుదుట తిలకమమర్చేవాడను, ఇప్పుడా ఫాలము తిలకరహితమై చంద్రుడులేని రాత్రివలెను, పువ్వులు లేని యీమెజడ నక్షత్రములులేని యాకాశమువలెనూ శోభాహీనముగా నుండును కదా? ఈస్థలములన్నీ నాకు చిరపరిచితములు, కాని వీటిమధ్య వనలక్ష్మివంటి నాచంద్రిక లేనందున చంద్రికలేని రాత్రివలె నామనస్సు శోకతిమిరావృతమైనది. ఇక్కడ చాలసేపుండరాదు, ఇంటిలోకి పోతే ఆమె కానవచ్చును.

(తులసిపూజ చేస్తూన్న చంద్రిక)

అదిగో ఎవరో అచ్చట పూజ చేస్తూన్నట్లున్నది... ఎవరో కాదు చంద్రిక-అయ్యో! ఈమె శరీరకాంతి, కట్టిన బట్టయు పేరునకు తగియున్నవి. ఎన్ని యున్న నేమి?

చంద్రి—అమ్మా, విష్ణుప్రియా, మహాలక్ష్మి-నేనీజన్మమున దౌర్భాగ్యురాలనని నిశ్చయమాయెను కదా? ఇట్టి నాకు పూర్ణాయుర్దాయ మివ్వక నన్ను నీలో నైక్యముచేసుకొని, ఆతనికి సంతతసౌఖ్యము ప్రసాదించు మమ్మా. అతనిని నే నెప్పుడూ మరువనట్లున్నూ నన్నాతడీజన్మమున మరచునట్లున్నూ వరమిమ్ము. జే! బృందావనలక్ష్మీ!



చకో—ఈమె ఎవనిగురించి ప్రసంగిస్తూన్నదో?

చంద్రి—వారేగిన దేశమున వారి కాయురారోగ్యము లొసంగుము- నాకై నిన్నేమీ యడుగను. ఆతనిని దీర్ఘాయువుని జేసి సుఖముగా నింటజేర్చి సమస్తమంగళములూ చేకూర్చుము తల్లీ!

చకో—ఈమె నాగూర్చి పరితపిస్తున్నది. ఆహా! నన్ను మరువలేదు, కావున నాయత్నము ఫలించునని ఆశ పుట్టుతూన్నది...చంద్రికా! చంద్రికా! నీవు నన్ను మరువలేవు గాని నిన్ను నేను మరువవలెనని కోరుతూన్నావా? ఎంత కఠినరాలవు! నా హృదయఫలకమున వజ్రసారముతో లిఖించిన నీచిత్తరువు అరిగిపోవునెట్లు?...ఆహా! ఈచంద్రికకెంత గాంభీర్య మావహించినది! ఇది వింతకాదు. ఈమెకు సంక్రమించిన పరివర్తనము లనన్యసామాన్యములు. ప్రాతఃకాలమున కన్య, మధ్యాహ్నము ధర్మపత్ని, సాయంత్రమున విధవ- ఇట్టి విపరీతపరిణతి చెందిన ఈమెచిత్తవృత్తి ఎట్టి దశాపరిణామమైన చెందగలదు. తులసిచుట్టూ ప్రదక్షిణము చేస్తూన్న ఈమె సూర్యునావరించు మెరుపుతో కూడిన శారదాభ్రమువలె నున్నది. ఇక నీమె యింటిలో కరుగును, కావున సమీపించుట యిదే తరుణము. (నడుచును)

చంద్రి—(కాలిచప్పుడు విని) ఓహో! ఎవరో బాలయోగి. ఆహా! జ్ఞానతేజస్సు విగ్రహముదాల్చినట్లున్నది. కుమారసంభవమున పార్వతిని చేరబోయిన కుహనాతాపసి

వలె నున్నాడు. పోయి కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యములు తెస్తాను. (నడచి) స్వామీ, ఈ వేదికపై దయచేయండి. ఇలతలో నే నర్ఘ్యపాద్యములు తీసికొనివస్తాను.

చకో—అబలామణీ,—అనర్ఘమైన నీమూర్తి చూడడమే నాకర్ఘ్యము, నిన్ను తలంచినతోడనే స్రవించిన అశ్రుధారచే నా సర్వాంగములు నార్ద్రమైనవి. ఇక వేరు పాద్యమక్కరలేదు. నిన్నొకభిక్ష యాచించవలెనని వచ్చితిని.

చంద్రి—హా! విధీ (మూర్ఛ పోవును)

చకో—(ఆమెను పట్టుకొని కమండలువులోని నీరు జల్లి) చంద్రికా! చంద్రికా!

చంద్రి—(తేరి) నేను పాపిష్టిదానను, దౌర్భాగ్యదేవతను. నన్నంటవద్దు, మీకు సుఖముగా నుండండి. నావంటి మందభాగ్యను చూచినట్లయితే మీకు చేటు తప్పదు.

చకో—అమృతకళికను స్పృశిస్తే చేటు మూడునా? ఏదీ నీచేతిమీద రామనామము పచ్చబొట్టుండవలెను, చూడనీ? అయ్యో! సంతతశ్రీరామసంకీర్తనము చేస్తూన్న దానవైనా నీకు కష్టములు తప్పలేదుకదా? ఔను. శ్రీరాముడే ప్రియావిరహముచేత అష్టకష్టములూ పడవలసి వచ్చెను. విధిబలమే ఉత్కృష్టము. కాని నిన్నీ దుఃఖవార్ధి దాటడ మేలాగు?

చంద్రి—నామాట కేమిగాని, నా కొరకు మీ రీ వేషము పూనవలసివచ్చెను కదా? శాలువలు, చీనాంబరములూ దాల్చవలసిన శరీరము కాషాయాంబరమునూ, కస్తూరీతిలకమును ధరించవలసిన ఫాలము వెలిబూడిదెనూ, మణిహారములచే నొప్పదగిన కంఠము రుద్రాక్షపేరునూ, దీనులకు భిక్షనొసగు కరము జోలెనూ ధరించవలసివచ్చెను కదా? ఆహా! కాలగతి కే మందును?

చకో—చంద్రికా, నామాట కేమి, ఇది తాత్కాలికము, క్షణస్థాయి, నీ యవస్థ చూడు. నీవు ధరించని వస్త్రములు నేను ధరింతునా? నీ వనుభవించని భోగములు నే ననుభవింతునా? నీవు దుఃఖాంబుధిని మునిగియుండగా నేను సౌఖ్యాబ్ధి నీదగలనా? సుఖము గాని దుఃఖముగానీ నీతో సమానముగా ననుభవించడమే నాకు పరమార్థము. శరీరములు రెండైనా మనకిద్దరికీ ఆత్మ యొక్కటే అని నీ వెరుగవా? ఆబాల్యవర్ధితమైన మన యనురాగము మరచితివా?

చంద్రి—ఆదినము లిక రావు. గతజలసేతుబంధమేల? అదంతా స్వప్నావస్థ. మానిన పుండును రగుల్చడ మెందుకు? అప్పటి చంద్రిక చచ్చినది. ఇప్పు డున్నది దౌర్భాగ్యదేవత మహామారిని బోలిన నన్ను మీ హృదయమునుండి తొలగించండి, లేకున్న సర్వసుఖనాశనము కాగలదు. నన్ను చూడవచ్చుట మీ కపాయకరము-ఎవరైనా విన్నట్టయితే మీకూ నాకూ సంకటములు సంభవించును. నాదుఃఖము నన్నే తపించనివ్వండి-నన్నుచూచి మీరేల అనుతప్త

లవుతారు? నన్ను మరచి మీ జీవితము సుఖావహము చేసుకొనండి. నాయందలి యనురాగలతికను తెంచివేయకపోతే మీకు సంపూర్ణసుఖ మలవడదు. నాకొరకు లేనికష్టముల నెందుకు తెచ్చుకొంటారు? నాదుర్గతి నే ననుభవించక తీరదు. నాచెయ్యి విడిచి హాయిగా ఇంటికి పొండి.

చకో—చంద్రికా, నీమాటలు నాకు వింతగా నున్నవి. ప్రాజ్ఞురాలివలె పల్కుతూ తిరిగీ అజ్ఞానమున బడుతూన్నావు...నిన్నిప్పుడు నిర్బంధపెట్టను...ఇదే నీచెయ్యి విడుస్తూన్నాను-తిరిగీ పాణిగ్రహణ మహోత్సవము జరుగువేళ నీవే అందింతువులే...ఇది నీకు కష్టమైనట్టయితే నీ యిష్ట మేదో చెప్పు. నా మనోనిశ్చయము విను. ఎన్ని కష్టములు వచ్చినా, తుదకు ప్రాణములు పోయినా సరే నీకు నీకు సుఖము చేకూర్చితీరుతాను.

చంద్రి—పాణిగ్రహణ మన్న పునర్వివాహ మేనా?

చకో—కాదు-మనకిద్దరికీ జరగవలసినదే వివాహము-నీతండ్రి నిన్ను నాకిచ్చి పెళ్ళి చేస్తానని నమ్మించలేదా? వివాహ మయినదాకా ఓపికపట్టలేక అ ముసలిముద్దను నీ కంఠమున కురిపోసి తాను పడుచుభార్యతో కులుకుతూన్నాడు-అది నీకు పునర్వివాహము. అది అక్రమమనీ, నీకు శ్రేయోదాయకము కాదనీ భగవంతుడే నిదర్శనము చూపి మనసా జరిగిన మనవివాహమే స్థిరపరిచినాడు. విదేశమున నే నుండడముచేత దాని కంతరాయము సంభవించెను; ఇప్పు



డది తొలగినది...నేను నిన్ను చూడవచ్చినందు కెవ్వ రేమనగలరు? నిన్ను వివాహమాడు తలంపున వచ్చినా నందురు. అం దబద్ధ మేమున్నది?

చంద్రి—పునర్వివాహము న్యాయానుసారియైనా శాస్త్రమూ ఆచారమున్నూ దానికి ప్రతికూలముగా నున్నవే-

చకో—ఆచర్చమాట యెత్తిన లాభములేదు. స్మృతులూ శ్రుతులున్నూ ఒప్పుకొన్నవి-మాటలను నులిమి లేనిపోని యర్థములు కల్పించి యిప్పటి పూర్వాచారపరాయణులు మసిబూసి మారేడు చేస్తున్నారు-నికరమునకు వస్తే ఒకరూ నిలవలేరు. మనశాస్త్రకారులు పరిస్థితుల ననుసరించి కొంతవరకూ స్మృతులు సవరించినారు. జనసామాన్యమునకీసంగతి తెలియదు. అందుచేత గతానుగతికులై పండితమ్మన్యుల మాట కాదనలేరు.

ఇక ఆచారము ప్రతికూల మన్నావు? శాస్త్రముపైని కాని సంఘనీతిపైని కాని ఆధారపడని ఆచారము మూఢవ్యవహారము, ప్రజ్ఞాజనితము కాదు-ఆచారము దేశకాలపాత్రముల ననుసరించి భేదించును. శాస్త్రమం దంత భేద ముండదు. సంఘముయొక్క యోగక్షేమముల కనుకూలముగా ఆచారములు నిష్పన్న మవును. తత్పరిస్థితులు మారినప్పుడాచారములు కూడా మారును-ధర్మశాస్త్రములు, శృతులు, స్మృతులున్నూ సంఘస్కంధములు, ఆచారములు శాఖలు.

మొదటి రెండింటికన్న మూడోది శీఘ్రపరివర్తనము చెందుతూండును. సంఘాధికారు లాచారములను పరికిస్తూ అవసర మున్నప్పుడు వాటిని మార్చవలెను. మార్పు లేకుండా ఎప్పుడో మొదలుపెట్టిన ఆచారములు అతియోగ్యములనీ పవిత్రములూ, మరపనేయము లనీ భావించరాదు. మన పూర్వు లొప్పుకొని ఆచారము లెన్నో యిప్పుడు సర్వసమ్మతము లవుతూన్నవి-మాటకు విదేశయానము పూర్వము మంచి యాచారముగానే యుండెను-ఇటీవల జాతిబలము క్షీణించగా నది నిషేధించబడెను-ఇప్పుడు దేశోద్ధారణ కావలెనన్న విదేశయాన మత్యావశ్యకము, కావున దానిని గర్హించేవారే లేరు. ఇట్లే పునర్వివాహము కూడా కొన్ని దేశములందు ఆచారమైనది, ఇకముం దిక్కడా కాగలదు.

చంద్రి—మా ర్పావశ్యకమని ఎరిగియుండీ మనవా రెందుకు సంస్కరణము చేయలేరు?

చకో—మనోధైర్యము లేక-మనసంఘమునకు నాయకులు లేరు-సామాన్యుల కాపని చేయడమునకు సాహసము లేదు. ఇదే దొరతనమువారు చేయబూనితే ఒక్క శాసనము చాలును. సహగమనమూ, శిశుహత్య, మానవబలి మొదలయిన ఆచారములు మట్టిలో కలియలేదా?

చంద్రి—వారు పునర్వివాహప్రసంగ మెత్తుకోలేదేమి?



చకో—పైనిచెప్పిన మూఁడు దురాచారములయందున్నూ జీవహింస బహిరంగముగా జరుగడముచేత పరిపాలకులు దాని నాపివేసినారు-పునర్వివాహములు లేకపోవడమువల్ల జీవహింస కాకపోలేదు, కాని రహస్యముగా జరుగుతూన్నవి, అందుచేత వారు దాని నాపలేరు మనమతము జోలికి వారు రారు.

చంద్రి—అయితే అంతవరకూ వితంతువులు జీవన్మరణ మనుభవించవలసినదే?

చకో—ఏమి గతి? మన ఆచారము లన్నిటికీ మతము పునాది. మతవిషయికమైన మార్పులు చేయమని పరిపాలకుల శపథము-కాని మనవారిలో గొప్పవారు కొందరు పునర్వివాహములు ప్రచారములోనికి తెచ్చి అట్టివారి కేహానీ లేకుండా చేయవలసిందని కోరితే దొరతనమువారేదైనా చేయడమునకు సిద్ధులే.

చంద్రి—సరేకాని మొదట నొకని పెండ్లియాడి ధర్మపత్నియై వెనక నింకొకని చేరవచ్చునా?

చకో—వెర్రిదానా! పతి జీవించియున్నగదా ధర్మపత్నిగా నుండడము? పతి గతించడముతోనే పత్నిత్వమూ పోయినది-వివాహసమయమున దంపతులిద్దరూ శపథములు చేస్తారు-పత్ని గతించగానే పతి యింకొకర్తెను కట్టుకొంటాడే; చేసిన శపథ మేగంగలో కలిసింది? పతి గతించిన వెనక పత్ని యింకొకని చేపట్టకూడదా? అదే నిజమైనట్ట

యితే మన ధర్మశాస్త్రములలో నిది విధిగా నుదాహరించక పోవడ మేమి?

చంద్రి—సరే-వాదోపవాదముల కేమిగాని నేను చిన్నదానను, యుక్తవయస్సు రాలేదు; మావాళ్ళు సమ్మతించకపోతే నే నేమి చేయగలను? నాకు మీయం దెంత అనురాగ మున్నా నా పోషకులమాట త్రోసివేయవచ్చునా?- మనసు మీయధీనము చేసితిని, శరీరము వారియధీన మవుచున్నది; నేను స్వతంత్రను కాను, వాళ్ళ అనుమతిలేక నే నేమి చేయగలను?

చకో—మీఅన్న కిది సమ్మతము కాదని నే నెరుగుదును, అతని...

[హరిహరశాస్త్రి, విహారుడు, తరంగిణియూ వత్తురు.]

విహా—చంద్రికా! ఎవ రాసన్నాసి?

చకో—నేను చకోరుడను-నా బాల్యమిత్రము కష్టములపా లయిందని సమాశ్వాసింప వచ్చినాను.

విహా—ఈ దొంగవేష మేమి?

చకో—ఇందుకు నీవే కారణభూతుడవు-బైరాగులతో తప్ప యితరులతో మాటాడవద్దని కట్టిడి చేసినావు. అందుకీవేషము వేసినాను—

విహా—ఓరి దుర్మార్గుడా! మాతో నీకు మైత్రి ఎట్టిది? ఒంటరిగానున్న బాలిక నూరడింతునని మిషపెట్టి ఏమి దుర్బోధన చేస్తూన్నావో? నిన్ను బహిష్కరించవలె



నని అందరూ పట్టుబట్టితే మీనాన్నగారి మాట విని నేను వారిని శాంతపరచినాను. నేను చేసిన మేలుకు ప్రత్యుపకార మిదా? దొంగవని నిన్నిప్పుడే పోలీసువారి కప్పగించి కారాగృహమున వేయిస్తాను చూచుకో-

చకో—నీచేత నయినంత చేయుము, నే నన్నిటికీ సిద్ధముగా నున్నాను.

తరం—ఇదేనా మా చకోరునిమీదేనా? నాయనా చకోరా, సుఖముగా నున్నావా? ఈవేష మెందుకు వేసినావు?

విహా—చూచినావా మీ చకోరు డెంత బుద్ధిమంతుడో? ఈ వేషధారి ఏమో నిర్వాహము చేస్తాడని మీ యాశ!

(మనోహరుడు వచ్చును)

మనో—నేను చకోరు నొక్కతీరున కాచుకొని యుండినా నేను నాకన్న మొరలించి ఎక్కడికో ప్రయాణమైనాడు-ఇక్కడికి వచ్చియుండునని తలచెదను-ఏమంటే వాని లక్ష్య మిక్కడ నుండె.

చకో—(స్వ) నే నెంతో రహస్యముగా నెరవేర్చ దలచిన పని అందరికి తెలిసినది; ఇప్పుడు ధైర్యము విడువ కూడదు. ఇప్పుడే అంతా తేలగలదు.

చంద్రి—అన్నా! నా ప్రియున కెట్టి యవస్థ ప్రాప్తించినది. దీని కంతకూ నేనే మూలము. నాకు మేలుచేయ

దలచిన వారందరికీ నా దురదృష్టమే దాపురిస్తూన్నది.

విహా—మనోహరం పంతులుగారూ, చూచినారా, కష్టపడి విదేశమున కంపి చదువు చెప్పించినందుకు మీ తమ్ముడెంత ప్రయోజకు డైనాడో? మీవలెనే ఆతడున్నూ అనాథ శరణాలయమునకు క్రొత్త వితంతువులను చేర్చడాని కెంత పాటుబడుతూన్నాడో చూడండి-మీవలెనే జోలి పట్టుకొని ధనమార్జించడమునకు బయలుదేరినాడు-విశేష మేమంటే, మీకన్న అతడు చతురవేషధారి-నవనాగరికులవలె ప్రేమభిక్షాయాచనము (Wooing) కూడా ప్రారంభించినాడు-జోడు కుదిరింది మీ యిద్దరికి!

మనో—విహారా! లోకానుభవము లేనివా డౌటచేత కొంచెము పొరబాటు పడ్డాడు. దీనిని క్షమించవలయునని వేడుచున్నాను-

హరి—"చంకదుడ్డు శరణార్థి". ఎంత తప్పుచేసినా క్షమధ్వ మంటే సరి.

విహా—ఈ నక్కవినయములు నే నెరుగకపోలేదు.

మనో—ఈత డీవేషము వేయుడమునకు మీరే కారణభూతులు.

విహా—ఎందుచేత?

మనో—చంద్రికాచకోరులు బాల్యమిత్రులని యెరిగి యుండీ వారి పరస్పరావలోకనమును నిషేధించకూడదు-ఆరు సంవత్సరము లెడబాసియుండుటచేత వా రొకరినొకరు చూడ



గోరడము సహజము. దానికి మీ రంతరాయములు కల్పించబట్టి వాళ్ళుకూడా క్రొత్తెత్తు వేసినారు.

విహా—బాగుబాగు-మైత్రి యుండవచ్చుగాక; పరిస్థితులు మారి ప్రమాద మాసన్నమైనప్పుడు మాపిల్లను మేము కాపాడుకోగూడదా? నీతమ్ముని కెదురుగా మాచెల్లెలిని తీసుకొనిపోయి వారికిద్దరికీ పునర్వివాహము చేయు మందురుకాబోలు?

మనో—ఆవశ్యక మైతే అలాగే చేయవచ్చును.

హరి—కొంపకి నిప్పటించవచ్చును!

విహా—మీ నవనాగరికుల సలహా లట్టివే-మాకు వాటితో పనిలేదు. క్రొత్తమార్గము లన్నీ ఉపద్రవకరములే.

మనో—ఆలాగైన రైలుబండి ఎక్కకండి; పోష్టులో ఉత్తరాలు వేయకండి.

హరి—దీనికి సమాధానము చెప్పనా? మనోహరరావుగారూ, ప్రతియింటిలోనూ చాకిరీ చేయడానికి వితంతువొకర్తె ఆవశ్యకము. ఆమె లేకున్న గృహిణిపని మితిమీరుతుంది. ఈసౌకర్యము పునర్వివాహమునకు గొప్ప ప్రతిబంధక మవునా? కాదా?

మనో—చాల్చాలు-శాస్త్రులుగారూ, గొప్పయుక్తి నే వెదకినారు. చాకిరీకి మనిషి కావలెనంటే నౌకరిని పెట్టుకోవలెను: కాని ఒకప్రాణికి యావజ్జీవదుఃఖము కల్గింతురా?

హరి—దుఃఖ మేమి? మానవసేవ అత్యంతసుఖ

దాయక మంటారే మీరు? స్వసుఖనిరభిలాషతో నితరులను సేవించడమే కదా మీ కుత్తమలక్ష్యము? అట్టి సువిషయము విధవల కయాచితముగా ప్రాప్తిస్తే దానిని వ్యర్థపర్చవచ్చునా? కావున వితంతువు వివాహము చేసుకోరాదు.

మనో—శాస్త్రులుగారూ, మీకు మరో ఊహ జ్ఞాపకము చేస్తాను. వితంతువు పెళ్ళి చేసుకొన్నట్టయితే ఒక్కరికే ఉపచరించును, లేకుంటే ననేకులకు సేవచేయవచ్చును. దీనివల్ల నామె కుత్తరగతులు శీఘ్రముగా చేకూరగలవు.

హరి—సరి. కుయుక్తుల కేమిగాని, విధవలకు పునర్వివాహ మవసరము లేదు. జన్మతః వారికిగల సాత్త్వికప్రేమ ఆప్తులకు సేవచేయడములో వినియోగించవచ్చును. అంతతోనే వారికి తృప్తి.

మనో—సరే కాని పురుషులయెడ నీయుక్తి ప్రయోగించరాదా? కర్మాధికారము కాలిపోవునని కదా మూడు కాళ్ళముసలికైనా ముద్దుగారు ముగ్ధను కట్టిపెట్టుతూన్నారు. ఇదేమి న్యాయము?

హరి—పురుషులసంగతి వేరు—మగవాడు మహారాజు. గార్హస్థ్యధర్మమునకు లోపము గాకూడదు—విధురుడూ వితంతువు వంటివాడే అనే మీ వాదమునకు అవ్యాప్తి దోషము సంక్రమించింది.

మనో—విధురునికన్న వితంతువుకు మనోబలము



తక్కువౌటచేతనే వీళ్ళకు భ్రూణహత్య, ఆత్మహత్యాదోషములు సంక్రమిస్తూన్నవి.

విహా—ఈ విషయమున శాస్త్రిగారి వాదము బలహీనమే. వితంతువుకు వివాహము నిషిద్ధమయితే విధురునికి కూడా నిషిద్ధమే కావలెను. పతిగతించినవెనక పత్ని నీతివంతురాలై యుండవలెనని నిర్బంధిస్తే విధురునిమాత్రమట్లు నిర్బంధించక తీరునా? ఇద్దరికి బ్రహ్మచర్యమే విధి కావలెను. అనుకోకూడదు గాని నాకే అట్టి యవస్థ చేకూడినట్లయితే నేను యావజ్జీవమూ పరోపకారమూ, మానవసేవా చేస్తూ అవివాహితుడనై యుంటానని శపథము చేస్తున్నాను.

మనో—విహారా, వాదావేశమున నోటికి వచ్చినట్లు శపథము చేయకు; తరువాత పశ్చాత్తాపపడవలసి వచ్చును సుమా!

విహా—ప్రతిజ్ఞాభంగము చేయడానికి మీబోటి బూటకపు సంస్కర్తను కాను నేను.

మనో—మాటల కేమిలే నీతలపై నెగిరిపోయినవారు ప్రతిజ్ఞాభంగ మొనర్చియున్నారు, నీవోలెక్క? సాక్షాత్తు శ్రీకృష్ణభగవానులకే ప్రతిజ్ఞానిరసనము ప్రాప్తించింది.

విహా—నేనేకాని చేసినప్రతిన నెరవేర్చలేకపోయినట్టయితే నీవు చెప్పినట్లు నడుచుకొంటాను. ఇదే పందెము.

తరం—అదికాదు—చేసినప్రతిజ్ఞ మీరు చెరచినట్ట

యితే చంద్రికాచకోరులకు వివాహము చేసి తీరవలెను-ఒప్పుకొంటారా?

విహా—వారిద్దరికీ సమ్మత మయినట్టయితే నా అభ్యంతర మప్పుడుండదు.

తరం—చకోరా, ఈ వేషము విప్పుము.

విహా—నాయింటిలోని పాతగుడ్డనైనా వీని కివ్వను. ఈనీలుగుబోతు నలుగురూ నవ్వేటట్లు వీధిలో ఈ వేషముతోనే పోనీ.

తర—పాతగుడ్డ వాని కెందుకు? కొత్తవే తెప్పించెదను.

హరి—(విహారుని చెవిలో) ఇదంతా వీరు కూడ బలుకుకొన్నట్లుంది-మీరెంతమాత్రమూ మెత్తబడకండి.

విహా—మీరంతా ఒకమందలోవారే-

మనో—విహారా! నీవెంత పూర్వాచారపరాయణుడవైనా మమ్మీసడింపుమాట లాడకు. నీవుమాత్రము ఆకాశమునుండి ఊడిపడ్డావా? మాబంధువులలోనివాడవు మా మందలోనే చేరితివిగా?...ఈ జగడాలమారి మాట విని మమ్మీరీతిని పరిభవిస్తూన్నావు.

హరి—మనోహరరావూ! నేను పెదవి కదల్పలేదే? ఇతడు నామాట ఏది విన్నాడు?

తరం—కోపము వచ్చినప్పుడు మీకు కిందామీదా కానరాదు.



హరి—(విహారునితో) చూచావా ఎంతమాట నిన్నన్నాదో? ఎక్కువచను వాడవాళ్లకిస్తే ఇదే ముప్పు.

విహా—(తరంగిణితో) ఇదుగో నాలుగురోజులనుండీ నిన్ను కనిపెట్టుతూన్నాను-నన్నొక గడ్డిపోచవలె చూస్తున్నావు-మాటకు ఎదు రాడుతూన్నావు-పినతల్లికొడుకుల మీద అంత భక్తిశ్రద్ధలు కలదానవైతే అనాధశరణాలయమునకు పోయి హాయిగా కూర్చో.

తరం—అందరివంతూ అయినది, ఇక నావంతు వచ్చినది-అనాధ లుండేచోటికి సనాథ నెట్లు పోగలను? మీరు కొంచెము శాంతించండి.

విహా—అదిగో-మళ్ళీ ఆమాటే-చకోరు డూరికి వచ్చినప్పటినుంచీ నీకు తలబిరు సెక్కువైనది. నీకు తగినశిక్ష కావలెను. ..తక్షణమే ఇటనుండి లేచిపో-అప్పటికిగాని నీగర్వ మణగదు.

తరం—పరియాచకమునకు నేనన్న మాటలు పాటి చేయకండి-మీపాదసేవ వదలి నే నెక్కడికీ పోను-నా కిక్కడ నుండుటకు హక్కున్నది.

విహా—హక్కూ లేదు, గిక్కూ లేదు. ఆడదానికి హక్కేమిటి? లేచిపో.

హరి—బలే! అదీ పౌరుషము.

తరం—మీరే ఎత్తినారు గనుక మనవిచేసుకొంటున్నాను-నాలుగు దినములనుండి మీరు నాయెడ విముఖులై

యున్నారు-మావారు విదేశీయుల కేగినందుకు నన్ను దండి స్తూన్నారు-సరే-మీ యిష్ట మెట్లో ఆలాగే కానివ్వండి. మీరు సుముఖులు, అనుకూలు రయినప్పుడే మీదాసని గృపజూస్తారు. అంతవరకు బ్రతి కుండకుంటే ఇదే ఆఖరు నమస్కారము.

(విహారుడు శాస్త్రిలు తప్ప అందరు వెళ్ళుదురు)

విహా—చూచినారా శాస్త్రిగారూ నా పట్టుదల?

హరి—(స్వ) ఈమె యింటినుండి పోవడము నాకు చాలా మెరుగు. ఇక చంద్రిక నాకు దక్కిన దన్నమాటే-సరస్వతి పొగ రడగగలదు. (ప్రకా)—అయ్యా! మీబోటి కార్యశూరులు పదిమం దుంటే సనాతనధర్మ మిప్పటివలె సన్నగిల్లునా?

విహా—(స్వ) డంబముకొర కిల్లాలి నింటినుండి తరిమి నాను. దాని మనస్సు చాలా సున్నిత మైనది, ఎంత నొచ్చిందో? ఈ తిరస్కారమును సహించలేక ఆత్మహత్య చేసుకొంటుందో, లేక పుట్టింటికి పోయి కొద్దిదినములు గతిం చగానే క్షమాపణ వేడుదామని వస్తుందో? మనోహరు డిదంతా చూస్తున్నాడు, కావున తనయింటికి తప్పకుండా తీసుకొని పోవును. చేజేతులా చేసుకొన్నది నే ననుభవించి తీరవలెను. ఆవేశవశమున అనరానిమాట లన్నాను. ఆమె గతి యేమైనదో పరికించవలెను. (ప్రకా) ఇంక మనమూ పోదాము.

---



## —మూడో రంగము—విహారు నిల్లు.—

చంద్రిక

చంద్రి—నాకొర కాతని కెంత యాపద తటస్థించి నది! రహస్యముగా నన్ను చూడవలెనని వచ్చి పరిహాసము నకు పాత్రు డయ్యెను, కాని అమితధైర్యశాలి, గభీరుడూ, కార్యవాదీ కనుక చెదరి కదల్పలేదు. మాఅన్న సహజముగా శాంతుడే కాని ఆ జగడాలమారి శాస్త్రిలు లేనిపోని పోటీలు చెప్పి అతనికి పురియెక్కించి మా వదినె నింటినుండి తరిమించి నాడు. చెప్పుడు మాటలు విన్న చెనటుల చేష్ట లిట్టివే.

(హరిహర శాస్త్రి వచ్చును)

హరి—(స్వ) చకోరునికి సంభవించిన పరాభవము మరవకముందే ఈమెను లొంగదీయవలెను. కేశవపన మనే అప్రతిహతమైన అస్త్రము నాచేత నున్నది; దాని నీమెకు చూపినవెంటనే ఈమె మెత్తపడి తీరును-పూర్వాచారము లెంత అసందర్భములైనా ఆడవారిని భయపెట్టడమున కమి తోపకారు లవును. (ప్రకా) చంద్రికా, నీకు కుశలమా? మొగము వాడిన ట్లున్న దేమి?

చంద్రి—అయ్యా! మా దుస్థితి చూసుకుంటే మనసు కుత్సాహ ముండడ మేలాగు? ఎవరితోనూ మాటాడ కూడదు, ఎవరింటికీ పోకూడదు, చండాలులవలె మమ్మ ఎవ్వరూ దరి జేరనీయరు. భగవంతుడుకూడా మాచేతినీరు

గ్రహించడు-అందరికీ హేయమైన జీవనము చేస్తూన్నప్పుడు మనస్సుకు సుఖ మెట్లు చేకూరగలదు?

హరి—తరంగిణి చూస్తూన్న దని నేను నీవు తెచ్చిన నీరు దేవతార్చనకు పనికిరా దన్నాను గాని వస్తుతః నీయందు నా కెట్టి సానుభూతి, ప్రేమ ఉన్నదో భగవంతునికే తెలుసును-నా కహర్నిశమూ నీ అవస్థ కళ్లకు కట్టియుండును-అన్నము నోటికి పోదు, నిద్ర కంటికి రాదు.

చంద్రి—(స్వ) ఏమి నక్కవినయములు!

హరి—నీకు సుఖము చేకూర్చడమునకు నే నెంత పాటుబడుతూన్నానో ఎవ్వరూ ఎరుగరు-మొన్న నీకు సంభవించిన గొప్పసంకటమును తొలగించేసరికి నా తలప్రాణము తోకకు వచ్చింది.

చంద్రి—మీకు మాపై నవ్యాజప్రేమ యున్నది గనుకనే మాకు తెలియకుండా మాపై నాపదలు తొలగిస్తూన్నారు.

హరి—నీకు జుట్టున్నందువల్ల ముఖ మెంత శోభాయమానముగా నుంది-దానిని చెరచవలెనని ఎందరో పట్టుబట్టి గొప్ప గందరగోళము చేసినారు కాని నేను వాళ్ళనోరు సమ్మూలముగా నొక్కివేసినాను.

చంద్రి—మీరూ ఆమూకలోనే చేరినవా రనిన్నీ, మా అన్నయ్యతో మీ రెన్నిసారులు పోరినా అతడు మీ మాట లక్ష్యముచేయ లేదనిన్నీ మావదిన చెప్పింది-



హరి—సరిసరి-పెనిమిటిమీద పక్షపాతముచేత నట్లు చెప్పియుంటుంది-మాటవరుసకు అప్పటి వాదములో నే నా పక్షమే వహించియుంటిని కాని ఇప్పుడు నా అభిప్రాయము లన్నీ మారిపోయినవి-మొన్నటి వాదములో పండితు లందరూ నావాదము విని ముక్కుమీద వేలు పెట్టుకొన్నారు.

చంద్రి—మీ ఉపకార మెన్నడూ మరచిపోను...

హరి—ఇం దుపకార మేమున్నది? నీమీది జాలిచేత నింత చేసినాను. మొన్న చకోరుడు నిన్ను మోసగించడానికి బైరాగివేషము వేసిననాడు నాకు పట్టరాని కోపము వచ్చినది-వాడు చేసిన అల్లరికి మెడబట్టి గెంటవలె ననుకొన్నాను కాని మీ అన్నమొగము చూచి ఊర కున్నాను.

చంద్రి—ఆత డొనర్చినదంతా పవిత్రప్రేమప్రేరితము గనుక నా కందు దోషమేమీ కానరాదు.

హరి—ప్రేమ యుండవచ్చును, కాని పని చేసేటప్పుడు కిందూ మీదూ చూడనక్కరలేదా? నీమీద నాకుమాత్రము ప్రేమలేదా, అలాగని మీద పడితే బాగుంటుందా?

చంద్రి—అట్టి దురంతము చేసినవాళ్ళని చెప్పుతో కొట్టవలెను-పాపము నోరులేని అమాయికుని కంత శిక్ష విధించడము మా అన్నకు తగినపని కాదు-పదిమంది కెరిగించి అందరి యవమానమునకూ అతనిని పాత్రముగా చేయడము యుక్తము కాదు. దానివల్ల అతని గౌరవము తగ్గునా? సర్వాబదము. (విచారించును)

హరి—సరే, అయిన దేమో అయింది. ఇటుపైని అట్టి యాపద రాకుండా బందోబస్తు చేయ దలచి చకోరుడు విదేశమునకు వెళ్ళి వచ్చినందుకు వానిని వెలివేయ వలెనని నిశ్చయించినాము. అప్పుడు మనయింటివైపు రాలేడు, కావున ఎప్పటికీ వాడు నీకంట పడడు.

చంద్రి—ఇప్పుడు కంట పడుతూంటేకదా?

హరి—నాడిపే రిక మరచిపో, ఆ స్థానమున నన్నుంచితివా నీకు సకలశ్రేయములూ చేకూరుతవి-లేదా ఇక నీ జుట్టుండబోదు-నామాట ముమ్మాటికీ నిజము-చక్కగా ఆలోచించుకో...ఇప్పటి కీబెదరింపు చాలును. (వెళ్ళును)

చంద్రి—ఈ చండాలు డెంత ద్రోహము తలపెట్టినాడు! ఈ నీచుని చేరనివ్వడముచేతనే మా అన్నబుద్ధి చెడిపోయినది-అదేమి మాయో కాని వీనిమాటలు మాఅన్నకెంతో యిష్టము-సరళస్వభావుడు కావడముచేత వీని తులువతనము కనుగొనలేకపోయినాడు-వీడు రాక్షసకోటిలోవాడుగాని మనుష్యుడు కాడు-పోషించినవాళ్ళనే భక్షించేవాడు-విశ్వాసఘాతకుడు! ఇప్పటికైనా మా అన్న వీడిమైత్రి విడిచిన మేలగును.

---



—•నాలుగో రంగము•—మనోహరు నిల్లు.

(మనోహరుడు, తరంగిణి, చకోరుడు)

మనో—తమ్ముడా, నీకు లోకానుభవము చాలదు-మనమిత్రునియిల్లు దగ్గరగా నున్నందువల్ల ప్రమాదము తప్పింది...ఆతనిదుస్తులు నీకు సరిపడలేదు. ఔను, నీశరీరమునకు కొలజూచి కుట్టితే సరిపోవును.

తరం—అన్నా, ఆ పాడుశాస్త్రులుమాట విని మీ బావ నన్నెంత అల్లరి పెట్టినారో చూచితివి కదా? ఆయన దీర్ఘకోపి కారు; కావున ఈపాటి కబురు రావలసినదే-మధ్య వీ డేపితలాటకము పెట్టినాడో?

మనో—చెల్లీ, అప్పుడప్పు డిటువంటి ప్రణయకలహములు లేకుంటే సంసారము చప్పగా నుంటుంది-ఇట్టి విరహమున్నగాని దాంపత్యము సుఖము నివ్వదు.

తరం—నీ వెప్పుడూ ఈలాగే అంటూంటావు. నాకు మాత్రము ప్రాణములు నిల్పుకోవలెనని లేదు సుమా.

మనో—క్షణక్షణమునకూ ఆత్మహత్య చేసుకుంటూ ఉంటే వేయిప్రాణములయినా చాలవు.

తరం—నేడు కబురు రాకుంటే ఇక నాయన కంట పడను.

మనో—మా ఆశ్రమములో దూరినావంటే అతని కంట పడడానికి వీలులేదు.

చకో—నా కొక మంచి యుక్తి తోచింది.

తరం—ఏమి టది?

చకో—"మీరు నన్ను త్యజించినారు కావున నేను ప్రాణములు త్యజిస్తూన్నా"నని బావ కొక ఉత్తరము వ్రాసి అన్నయ్యచేత పంపించుదాము.

మనో—తీసుకో వెళ్ళడాని కభ్యంతరము లేదు కాని అతడు నిర్బంధించి ఈమె వృత్తాంత మడుగుతే నే నబద్ధము చెప్పను. వంచన పరమనింద్యము- వంచించినవారికీ వంచింప బడినవారికిన్నీ అపాయము కలుగును-

తరం—నిజముగా మనము వంచన చేయడము లేదే!

మనో—అట్లుకాదు-నే నాయుత్తర మివ్వగానే అతడు ప్రాణములైనా పోగొట్టుకోవలెను, లేకుంటే యావజ్జీవబ్రహ్మచారి కావలెను-

చకో—తరంగిణి బ్రతికియుండగానే?

మనో—నీయొత్తు నేను గ్రహించకపోలేదు-ఈమె బ్రతికియున్నదని ఆత డెరుగునా? ఉత్తరమును శంకింపనే శంకింపడు.

తరం—వారికి నాతత్వము బాగా తెలుసును; నాపై ప్రేమ యధికము.

మనో—అందుకే ప్రమాదము రావచ్చు నన్నాను.

తరం—అయితే ఉత్తర మెవరిచేత పంపడము?

మనో—చకోరుడే తీసుకొని పోవలయును.



చకో—న న్నతడు నమ్మడు, పైపెచ్చు ఇదంతా కుట్ర అంటాడు; మొదటికీ మోసము వస్తుంది.

మనో—నే నసత్య మాడననే కదా నన్నందరూ విశ్వసిస్తున్నారు? నేనుకూడా అబద్ధ మాడితే నామాట లోకములోని పాటి కాదా? ఆపని నే నోర్వలేను.

తరం—మేము తలచిన ఊహాకు రెండు విఘాతములు వచ్చినవి:—ఇతరుల కుట్రలు, స్వకీయుల సత్యనిరతి-ఇందేది తప్పకున్నా చకోరచంద్రికల జన్మములు దుఃఖభాజనము లయితీరును....అన్నయ్యా, దీని కేదో సరియైన మార్గము నీవే ఊహించవలెను.

మనో—అనుచితమైన కార్యము నేను చేయజాలను. నా కాధైర్యము లేదు.

తరం—"అయితే ఆరిగ కాకుండే కంది"; చేసి చూడు నీవు.

మనో—నీవు చెప్పినావనిన్నీ చకోరుని కిది లాభకర మనిన్నీ నేను చేతామన్నా కపటనాటక మాడడము నాచేత కాదు. అది నెరవేరకుంటే నాపై నింద పడవేయకండి.

తరం—ప్రశ్నిస్తేనే చెప్పెదనని మాత్రము మాట యిమ్ము.

మనో—అడిగినవారికి చెప్పక తీరదు- అడుగనప్పు డెవరితోనూ చెప్పను.

తరం—నే నీరోజుననే ఆశ్రమములో ప్రవేశించి ఉత్తరము సిద్ధము చేస్తాను, నీవు వచ్చి తీసికొనిపో. (పోవును.)

మనో—ఇదివర కెన్నో దుర్ఘటమైన కార్యము లొనర్చినాను కాని, ఇట్టి అనర్హకృత్యము నెన్నడూ తల దాల్పలేదు. సర్వేశ్వరా! నన్నిట్లు కృతకృత్యుని చేయుదువో నీదే పూచీ. (పోవును.)

చకో—(స్వ) ఇంకో ఉత్తర మన్నయ్యజేబులో నుంచినాను. "అది చూస్తే మీకు వివరములన్నీ తెలియగలవ''ని ఇంకొక ఉత్తరము అక్కచేత వ్రాయిస్తాను. దానిలో "మీకు కడుదుఃఖము కలుగునని మా యన్న మీతో నన్ని సంగతులూ చెప్పడని ఈయుత్తరము వ్రాసినాను''ని వ్రాయించెదను. ఇందువల్ల అన్నయ్య అసత్య మాడకుండానే కార్యము సాధించవచ్చును. ఈపన్నగడ కడతీరే దాకా నా హృదయమున నారాటము మానదు. అసత్య కల్పన మాచరించేవారి కిదే శిక్ష. నాప్రయత్నము గర్హ్యము కాకపోయినా నా అంతరాత్మ నన్నిట్లు బాధిస్తున్నదే? నింద్యకృత్యముల నే యరమర లేక ఆచరించేవారి కంతరాత్మ ఉండదు కాబోలు! ప్రమాదభరితమైన నిట్టి పనికి పూనుకొనడముకన్న మాఅన్నయ్య సరళమార్గమే మేలు.

[తెర దిగును]

—



—ఐదో రంగము—రాదారి

హరిహరశాస్త్రి.

హరి—కళ్ళార చూచినాను గనుక పొరపాటుండదు. తరంగిణి సగముదూరము పోయేసరికి బుద్ధిమార్చుకొనడము చేత వాళ్ళు తిరిగి వచ్చియుందురు. తరంగిణీవిహారు లన్యోన్యప్రేమబద్ధు లగుటకు సందేహము లేదు. నా రెప్పుడూ ఒకరినొకరు విడచి యుండలేరు. నేటి వియోగము వారికి తప్పకుండా దుర్భరమే. వారు మరలినారని నాకు ముందుగా తెలియడము మేలయింది, లేకుంటే ఈ తరుణముకు నే నిక్కడికి వచ్చియుందునా? మనోహరుడు తరంగిణి నింటివద్ద అప్పగించి ఒక్కడే తనయింటి కీదారినే తప్పక పోవును. అప్పు డొక్కపెట్టుతో గుక్కెడు నీళ్ళైన అడుగకుండా స్వర్గానికి పంపవచ్చును. నన్నెవ్వరూ అనుమానించరు. అతడీయూళ్ళో లేడన్న వదంతి నన్ను తప్పకుండా కాచుతుంది.

(భీరుడు వచ్చును)

భీరు—నే నేపని చేయలేనో అదే నానెత్తిమీద పడుతుంది. తరంగిణమ్మ నేడు పుట్టింటికి వెళ్ళినారట. అది నిజమేమో కనుగొని రమ్మని అర్ధరాత్రివేళ నన్ను తరిమినారు...నన్నే పిశాచమైనా గుటక వేస్తే వారి కేమినష్టము? నేను పోతే నాఅబ్బ యింకొకడు దొరుకుతాడు, వాడు పోతే వాడియబ్బ మరొకడు...శ్రీమంతులలో వారసత్వము పైనుండి కిందికి వచ్చును; నౌకరులలో కిందినుండి పైకిపోవును.

అనగా కొడుకునుండి తండ్రికి, తండ్రినుండి తాతకి. నాకు ఈ బొక్కిలాంతరు [illegible]. అసలే వెలుగులేదు, అందులో గాలి. పెద్దగాలి వేస్తే ఇ దారిపోతుంది!

హరి—ఓహో? ఈ దౌర్భాగ్యుడు వస్తూన్నాడు-దీప మార్పి కొంచెము జడిపిస్తే వీడు బెదరి పోతాడు (దీపమార్పి పిల్లివలె అరచును)

భీరు—బాబో దయ్యము- నే నేమిచేతును? నన్ను చంపాలని దారి కాచింది. ఇక్కడినుంచి పోకపోతే మళ్ళీ వచ్చి నాగొంతుక కొరకక మానదు. తరంగిణమ్మ అన్నకి పాముకరిచి అతడు చనిపోయెనని జాబు రావడముచేత వెంటనే వారందరూ వెళ్ళినారని బొంకి ప్రజల్లో పడతాను...

(పోవును.)

(మనోహరుడు వచ్చును.)

మనో—విహారుని ఋల్లు దగ్గరౌతున్నకొద్దీ నా దేహము కంపిస్తూన్నది, నాలుక ఎండిపోతున్నది, కాళ్ళీడ్చుకొని పోతూన్నవి. మిథ్యాచరణ సంపర్కమాత్రముననే నా కిట్లున్నది, దీనినే జీవాధారముగా చేసుకొన్నవారి కెలా గుండునో? మనస్సాక్షి నన్నింత వేధిస్తూన్నది, వారికి మనస్సాక్షి ఉండదు కాబోలు?... అబ్బా! గాఢాంధకారము, తోవా తెన్నూ కానరాలేదు, తడుముకుంటూ పోతాను.

హరి—ఇదుగో నా వేటపోతు వచ్చింది. వీ డొంటరిగా వచ్చినాడే?... ఊఁ. ఆగోల నా కెందుకు? నాకు భాగా



అనుకూలించింది. ఆచి నెత్తిమీద ఒక్కపెట్టు చాలును. (పోయి కొట్టును, తెరలో అమ్మా అని కేక వినబడును శాస్త్రి మెల్లగా జారును.)

(భీరుడు తిరిగి వచ్చును)

భీరు—అమ్మయ్య! ఇప్పటికి నాకు విడుదల అయింది. ఇంటికి పొమ్మని మా యజమాని యాజ్ఞ అయింది. (మనోహరుని శరీరము కాలికి తగులును) అయ్యో! బాబో ఇదెవరో తోవలో పడుకున్నారు (కదల్చి చూచి) శవములా గుంది, కదలలేదు. ఇందాకటి దయ్య మెవరినో చంపి దారితీసినట్లున్నది. నాతల్లి కడుపుచలువచేత నేను బ్రతికిపోయినాను గాని, దానికంట నేను పడియుంటే నన్నిలాగే చేసియుండును. పాపము వీడెవడో చచ్చి పడియున్నాడు. ఎవడో చూతునా? వీడి నంటగానే ఆభూతము నామీదికొస్తుందేమో?... నాకేల వీడిగోల? (పోవును)

---

## —ఆరో రంగము—ఆనందరావిల్లు—

(మనోహరుని మంచము మీద ఆనందరావు,
ప్రక్కను సరస్వతి)

ఆనం—ఇతడు తరంగిణి పుట్టింటి కెప్పుడు వెళ్ళెను, తిరిగీ ఎప్పుడు వచ్చెను? వింతగా నున్నది! జేబులో ఏమైనా ఉన్నదేమో చూతాము. (ఉత్తరము చూచి) అయ్యో! తరంగిణి ఆత్మహత్య చేసుకొన్నదా? ఆహా! స్త్రీ లెంత మూ

ఝలు!... ఓరీ సేవకా, విహారుని పిలుచుకొని రా. ఓరీ నీవు పోయి ఆశ్రమములో నున్న చకోరునితో కూడ ఈవృత్తాంతము చెప్పు. ...(సరస్వతిని చూచి) పాప మిది గురువుగారి కెంత జాగ్రత్తతోనో పరిచర్య చేస్తూన్నది. రోగులకు చాకిరీ ఆడ వాళ్ళే చేయవలెను... విన్నావా? తరంగిణి ఆత్మహత్య చేసు కొన్నదట!

సర—అయ్యో! ఎప్పుడు?...పోనీయండి- పసుపుకుంకుమతో వెళ్లిపోయింది, అదృష్టవంతురాలే... ఇతడు జీవించునా? నాడి ఆడుతూన్నదా?

ఆనం—నాడి నిక్షేపంగా ఉంది. ప్రాణభయములేదు. దెబ్బ మాత్రము మోపుగా తగిలింది.

సర—డాక్టరింకా రాలేదు.

ఆనం—తొందర మనకిగాని డాక్టరు కేమి పోయింది? ఫీజు చేతిలో పడితే సరి - రోగి ఏమైతే నేమి?

(విహారుడు వచ్చును)

విహా—(స్వ) దాని నెందుకు పొమ్మన్నానా అని నా మనస్సు చింతాకులముగా నుంది. పోయేటప్పు డది తపాలో వేసిన ఉత్తర మిప్పుడే అందినది. మనోహరునిచేత నింకొక జాబు పంపుతానని వ్రాసినది. అందులో వివరములు తెల్పు తా నన్నది. ఆ జాబులో నే మున్నదో? దాని ప్రాణము కపాయమేమీ వచ్చియుండదు కదా? ఏమో దానికి రోషము హెచ్చు. మనోహరు డింతలోనే రావడము, తోడనే



మూర్ఛ...వీటిని తలుచుకుంటే అడుగు ముందికి పడలేదు. కానీ, నా నుదుటివ్రాత ఏలాగున్నదో?

ఆనం—విహారా! సుఖదుఃఖములు కావడికుండలు, ఒకటి హెచ్చితే రెండోది తగ్గుతుంది. మనుష్యుడు ఈ రెండింటిని ఒక్కతీరుననే అనుభవించవలెను.

విహా—నాన్నగారు? ఇప్పు డీ వేదాంత మెందుకు? జరిగిన దేదో చెప్పండి. న న్నెందుకు పిలిచినారు?

ఆనం—కష్టములు వచ్చినప్పుడు ధైర్యము వీడని వాడే జ్ఞాని.

విహా—తరంగిణిసంగతి మీ కేమైనా తెలిసినదా? ఆ యుత్తరము మనోహరుడు తెచ్చిన దేనా? ఏదీ-ఈలా గివ్వండి (చదివి) హా! పరమేశ్వరా! నే నెంత పాపాత్ముడను! ఎంత ద్రోహిని! అయ్యో ప్రేయసీ, ఇదే నీ కడపటి జాబా? ఆహా, గృహలక్ష్మినింటినుండి గెంటిన హీనాత్ముడను...ఇక నీ జగమెల్ల నా కరణ్యమే కదా? నాకు సుఖ మెక్కడ? జన్మమున్నంతకాలమూ ఏడ్చిఏడ్చి జీర్ణించవలసినదే! నాకు చా వెప్పుడు వచ్చునో!

ఆనం—నాయనా! దుఃఖించి ఏమి ఫలము? అది తిరిగి వస్తుందా? కంఠశోష తప్ప వేరేమీ లేదు. ఎల్లప్పుడూ చింతించడమువల్ల మనోవ్యాధి పుట్టుతుంది, దానికి మందు లేదు-ఇదుగో చూడు, మనోహరుడింతవరకూ వివశుడై పడియున్నాడు.



విహా—దారుణదుఃఖాభిభూతుడనై నా పరమోప కారి యవస్థను మరచిపోయినాను. చీచీ, ఏమి నా మమ కారము!

ఆనం—చూచినావా? మీ దంపతులకున్న బాళియే నిన్నింతకు తెచ్చింది; అందుచేతనే పురుషుడు స్త్రీలోలుడు కాకూడ దంటారు. ప్రేమనంతా ఒక్కవ్యక్తిపైనే నిక్షిప్తము చేయరాదు. ప్రారబ్ధవశమున దాని కేదైనా హాని సంభవించి నట్లయితే సచరాచరజగమంతా సారహీనమై తోచి ప్రాణ మందలి ప్రేమకూడా నశించును. జంతువులకు చక్రనేమి క్రమమున సుఖదుఃఖములు సంభవిస్తూండును. పరమేశ్వరు డొనర్చినదంతా బాగుకొరకే అని గ్రహించి మనప్రేమ ఏకవస్తునిక్షిప్తము చేయక సర్వవస్తువులకూ సమముగా పంచుతూండవలెను. అందువల్ల దుఃఖము తగ్గి సుఖము చే కూరవచ్చును.

విహా—ఇప్పుడు నా కది సాధ్యము కాదు-నా మాన సహంసి వెడలిపోయినందున హృత్కాసారము శూన్య మయ్యెను; ఇక నీ సంసారమందు నాకు కొంచెమైనా ఆసక్తి లేదు. (వైద్యుడు వచ్చును)

ఆనం—డాక్టరుగారూ, అరగంటనుండి ఈతడిట్లే తెలివితప్పి పడియున్నాడు.

డాక్ట—(పరీక్షించి) జ్వర మధికముగా నున్నది. మోముపైన దెబ్బతగిలి స్పృహ తప్పినది.



సర—అయ్యా! ప్రాణభయము లేదు కదా? ఎంత సొమ్మైనా వెనుకతీయము, పరిచర్య చేయుటములో లోటు రానీయము.

డాక్ట—మనోహరరావుపైన మీ కనురాగ ముండడము వింతకాదు. అతడు లోకప్రియుడు, అమిత పరోపకారి. నాశక్తి వినియోగించడములో నేను వెనుదీయక సర్వవిధములా చికిత్సచేసి వారము దినములలో సంపూర్ణారోగ్యవంతునిగా చేసెదను. ఇప్పటి స్థితిని బట్టి చూస్తే ప్రాణభయ ముండదనే నిశ్చయించవచ్చును.

సర—మీకడుపు చల్లగా మంచిమాట చెప్పినారు. వారము కాదు నెలదినములకు పూర్ణారోగ్యము చేకూరినా చింతలేదు.

(చకోరుడు వచ్చును)

చకో—నాకోర్కె నెరవేర్చవలెనని పాటుబడినందుకు మాయన్నగారికి ప్రాణాపాయము సంభవించినది. దౌర్భాగ్యవంతుడనైన నామూలముననే కదా యింత యాపద మూడింది!... (మనోహరుని దగ్గరకుపోయి) అన్నయ్యా! అన్నయ్యా! నేను చకోరుడను...

మనో—(తెలివి తెచ్చుకొని) ఎవరు? చకోరా?

డాక్ట—అయ్యా! మనోహరరావుగారూ! జ్వరమతితీవ్రముగానుంది మీరు మాటలాడక పరుండండి, లేకుంటే జ్వరము హెచ్చుతుంది. (చకోరునితో రహస్యముగా మాటలాడును)

చకో—డాక్టరుగారు ప్రాణభయము లేదన్నారు-ఇప్పటి కదృష్టవంతులమే. హాయిగా పరుండనీ.

విహా—మనోహరా! మరణకాలమున నీతో తరంగిణి ఏమైనా చెప్పినదా?

ఆనం—అతనిని మాటలాడించవద్దని వైద్యుడు చెప్పెను, కావున నేమీ అడుగవద్దు.

విహా—చకోరా, దాని ముఖమైనా చూడగలనా? లేక ఆయాశా వదలుకోవలెనా? నీ కామెసంగతి ఎంతవరకు తెలుసును?

చకో—అయ్యా, అక్కా అన్నా యిద్దరూ ఒకరోజునే నన్ను బాయుదురేమో అను సంశయముచేత నాందోళపడిన నా చిత్తమింకా కుదుట పడలేదు..."మాఅక్క పుట్టింటికి బయలుదేరి ఒకమజిలీ చేరకముందే బావినొక దానిని చూచుకొన్నది. పంచాయితీ భయముచేత అన్నయ్య తక్షణమే దహనవిధి తీర్చుకొని యింటికి వచ్చినారు" అని మనవాళ్ళతో నరిగిన సేవకుడు చెప్పినాడు.

విహా—అయ్యో! ఇక దాని మొగము కనబడదు కదా? మనోహరా! నాతరంగిణి నాకిక లభించదా?

మనో—తరంగిణి కుశలముగా నుంది.

విహా—దివమున దానికి కుశలమే, దురదృష్టవంతుడను కావుననే నేను మిగిలిపోయినాను, నాతో నేమైనా చెప్పుమన్నదా?



ఆనం.—ఆపె రెత్తగానే సంధి తిరిగీ సంక్రమిస్తుందని వైద్యుడు చెప్పినాడు-అతనిని మాటాడించవద్దు.

~~ఆనం~~ మనో—ఇది సంధి కాదు. నామాట నిజమే.

చకో—అన్నా! మాటాడితే జ్వరము హెచ్చును-ఊరక పరుండుము.

డాక్ట—అతనిని ప్రశ్నలు వేసి కలత బెట్టకండి. ఆరోగ్యము చేకూరేవరకూ ఆమెమృత్యువార్తను గూర్చి ప్రశ్నించకండి. పదిరోజులలో పూర్ణారోగ్యము చేకూడును, అప్పుడన్ని అడుగవచ్చును.

సర్వ— పథ్యపానీయముల గురించి ఏమీ చెప్పినారుకారు?

డాక్ట—ఇచ్ఛాపథ్యము, మృత్యువార్తయే వర్జము. కట్టు ప్రతిరోజూ కట్టవలెను.

(విహారుడూ చకోరుడూ పోవుదురు. తెర దిగును.)

విహా—చకోరా! ఆమాయప్రతిజ్ఞ నా పాడునోటితో అన్నందు కా యవస్థ అచిరకాలముననే సంక్రమించినదే?

చకో—ఇక నాప్రసంగము మరువండి. ఏదో మాట వరుసకు చేసినప్రతిజ్ఞను మనసులో నుంచకండి-

విహా—మాటవరుసకా? కాదు కాదు. నీ వౌదార్యముతో నన్ను తప్పించ నెంచుతూన్నావు కాని, మదీయ గృహలక్ష్మి, నా నోముల పంటయైన ధర్మపత్నిని బాసి

నప్పుడే ఈ సంసారము త్య ంచి సన్యాసినై నాజీవమంతా పరోపకారార్థము వినియోగించవలెనని దృఢనిశ్చయము చేసుకొన్నాను.

చకో—పరోపకారమునకు ప్రాణములు భరించిన వాళ్లు సన్యాసులు కానక్కరలేదు.

విహా—అట్లుకాదు, నేను విరూపుడను కావలెను-పాపము మాచంద్రిక బ్రహ్మచర్య మొనర్చలేదా? నేనూ దానివలెనే తలదువ్వక, తెల్లనిబట్ట కట్టక, భోగములపొంత బోక, పతి గతించినవెన్క సతి ఏలా గుండవలెనో ఆరీతిని కాలము గడుపుతాను. ఆవ్రతము నాచరించడమున కిదే మొదలు...(పోవును)

చకో—ఇతని పట్టుదల మా కనుకూలముగానే యున్నది. నేను పోయి అహోరాత్రములు మాఅన్నను కనిపెట్టుకొని యుండి అతనికి పూర్ణస్వాస్థ్యము చేకూరిన వెన్క కార్యక్రమ మాలోచిస్తాను.






# నాలుగో అంకము

---

## మొదటి రంగము...రోడ్డు

హరహరశాస్త్రి

హరి—అదృష్టవంతుని అడచేవాడూ నిర్భాగ్యుని నెగడించేవాడూ ఉండడు. మనోహరుని స్వర్గమున కంప దలచి వానికి కపాలమోక్షము గావించితిని, కాని వానిరేఖ ఉచ్ఛ్రయం దున్నందున వా డీలోకముననే సరస్వతీసంసర్గమున ఇంద్రభోగ మనుభవిస్తూన్నాడు. తన్నితే పట్టుపరుపుపై పడ్డాడు. మత్సరగ్రస్తుడ నౌటచేత కాబోలు నాదెబ్బ మోపుగా తగులలేదు. రెండో దెబ్బతో సంశయచ్ఛేదము చేసుకొందా మంటే భీరుడు సంప్రాప్తించి అతని ప్రాణము కాచినాడు. తక్షణమే చికిత్స చేయకుంటే నాదెబ్బచేతనే మనోహరు డంతమొందియుండును-ఇప్పు డేమనుకొన్న నేమి లాభము? వానిరొట్టె నేతిలో పడినది-దివ్యభోగ మనుభవిస్తూన్నాడు-పరుండడమునకు పట్టుపరుపు పరిచర్యకు అప్సర

వలమించిన యువతి—యందుకు బదులుగా అధరామృతము సంతతమూ అర్పిస్తూండునుకదా? ఆమె యతని సొమ్మై పోయింది-ఇప్పు డాతనిశీలము పవిత్రమని యెంచేవాడు పరమ మూర్ఖుడు. తురుష్కచక్రవర్తివలె నూర్గురు యువతీమణులు పరిచర్యచేసే అవరోధమున సంతతమూ వర్తించేవాడు శుకుడు కానేరడు. సరస్వతి యింటినుండి నన్ను బైటకు తరిమిననాడే అత డామెపై కన్నువేసెననీ, ఆమె కూడా అతనిని వలచిందనీ ఆమె మాటలవల్లనే తెలిసింది, నా యాటంకము లేదుకావున వా రిక స్వైరవిహారము సాగించవచ్చును. ఈ విషయ మానందరావుచెవిలో వేసి ప్రత్యక్షప్రమాణము చూపించినట్లాయినా నేను కృతార్థుడ నౌదును, కాని యిదెట్లు జరుగగలదు? ఆనందరా వింటికి నేను పోగూడదు, కనుక మొదట వారినౌకరుల చేతులు తడిపి వాళ్ళను వశపర్చుకొని, ఆనందరావు నెక్కడనైనా కలిసి ఈవృత్తాంత మాతని కెరిగించవలెను. అనుమాన మను పెనుభూతము పట్టినా అమాయికుడైన ఆనందరావును నాచిత్తమువచ్చిన చొప్పున ఆడించవచ్చును. కావున నే నాపని జాగ్రత్తగా నడపవలెను.

---



రెండో రంగము-ఆనంద రావిల్లు

మనోహరుడు - సరస్వతి.

మనో—దెబ్బతగిలి వారమురోజులు లయినదా? నాకు స్పృహతప్పినందువల్ల నిన్నతగిలి నట్లున్నది.

సర—నాకు మాత్ర మొక్కొక్కరోజు మాసమువలె తోచింది.

మనో—ఔను. బెంగతో నున్నవారికి కాలము నిమ్మళముగా జరుగుతూండును. నాకో ఏ బెంగా లేదు, కనుక కాల మతివేగమున గతించినది.

సర—మొదటినాటి మీ యవస్థ చూస్తే ఇట్లు నలుగురిలో పడగల మనిపించనేలేదు-అబ్బా! ఏమి జ్వరతీవ్రము! ఒంటిమీద ధాన్యపుగింజ వేస్తే పేలగింజ ఔనట్లుండెను.!

మనో—సరస్వతీ, నీకు నాయెడ గల భక్తిశ్రద్ధ లమేయములు కదా? ఏజన్మమున అచ్చియున్నానో ఈవిధముగా అప్పు తీర్చుకొన్నావు నీమేలు నేను మరువజాలను.

సర—మన సంబంధము జన్మాంతర సంచితము. ఈఋణము తీరక ఇప్పుడూ ఇంకొక జన్మమునకూడా మీకు దాసినై యుండజేయుమని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

మనో—విహారు డిప్పు డెక్క డున్నాడు?

సర—తరంగిణీ విరసాముచేత విరక్తుడై తన జీవితము పరోపకారమునకు వినియోగించవలెనని వ్రతముపూని బాలురకు బడి చెప్పుతూన్నాడు.

మనో—ఇది శ్మశాన వైరాగ్యము- వాని మన సతి మెత్తన; భోగపరుడు కావున శీఘ్రకాలములోనే ఎవర్తెవలలోనో పడితీరును.

సర—మెత్తని హృదయముగల విధురుడు యువతీమధ్యమం దున్నా చపలచిత్తుడు కానక్కరలేదను సిద్ధాంతమునకు మీరే ప్రమాణము. ఆశ్రమమున నబలాగణముతో సంసర్గ ముండేది, ఈ పదిరోజులూ అహర్నిశమూ నిద్రావస్థయందు తప్ప నిరంతరమూ మీయొద్దనే యున్నాను.

మనో—నీవు నాకొనర్చిన ఉపచారమునకు ప్రతిఫలముగానేమి సమర్పించగలను? నీవు నాకు ధాత్రివై ధాత్రీ)దేవతవలె జీవము పోసినావు. ఈఋణము నేను తీర్చుకోలేను.

సర—నేను ఇతర ఫలాపేక్షతో మిమ్ము సేవించలేదు. మీయందలి యనురాగమే నాయుత్సాహమునకూ శక్తికిన్నీ కారణము.

మనో—నాకు పరిచర్య చేసి నీవు కడుచిక్కినావు- మొగమంతా పాలిపోయినది, కళ్ళు తెల్లబడ్డవి- నారోగము నీకు సంక్రమించిన ట్లున్నది.

సర—నా కంతటి యదృష్టమా ?

మనో—సరస్వతీ, నీవు నాకు తల్లికన్న నెక్కువగా పథ్యపానములు జరిపి, సోదరికన్న నెక్కువగా ప్రేమించి, కూతురుకన్న నెక్కువగా సేవజేసితివి. ఇందుకు ప్రతిగా నా దేహము నీ కర్పించినా చాలదు.



సర—సరిసరి. మీయందు నాకుగల ప్రేమను దెల్పడాని కిప్పుడు నేను చేసిన పరిచర్య ఏపాటి? నాసర్వస్వమును మీయెడ వినియోగించడమునకు సిద్ధురాలను. మీ రేమాత్రమైనా సంకోచింపక మీకు కావలసిన రీతిని నన్నుపయోగించుకో వచ్చును. మీ దేహము నా కర్పించనేల? నా దేహమును మీరు గ్రహించితిరా నాకు బ్రహ్మానందము చేకూర్చినవా రవుదురు.

మనో—నీవు వట్టి అమాయికురాలవు, కావున నీమాట లంతగా పాటించను, కాని ఆలా గనకూడదు సుమా!

సర—నాతప్పు నాకు తెలియదు. మనవిచేస్తే దిద్దుకొంటాను.

మనో—నీ దేహమును నన్ను పరిగ్రహించు మన్నావే అది తప్పుమాట.

సర—తప్పు కాదు, నే నాలోచించి నా మనసులోనున్న మాటే చెప్పినాను.

మనో— నీదేహమునకూ, ప్రాణమునకూ, సర్వస్వమునకూ నాథు డున్నాడు- అవి యాతని కర్పించవలసినవి కాని అన్యుల కివ్వదగినవి కావు.

సర—అ ట్లిచ్చినది నేను కాను. నా ప్రమేయము లేకుండానే నాతలిదండ్రులు చేసిన పని. దానికి నేను బాధ్యురాలను కాను.

మనో—నీవు తప్పు దలచినావు- నీ తలిదండ్రులు

నీకు గూర్చిన పతియే నీ దైవము. నీవు స్వతంత్రించి ఆతని ధిక్కరించితివా కులస్త్రీ వనిపించుకోవు.

సర—మనసులో నొకరీతి భావన ఉండి మాటలలో వేరొకరీతిని వర్తించ కూడునా?

మనో—కూడదనే నేను చెప్పేది. త్రికరణశుద్ధిగా నీపతినే దైవముగా భావించి అన్యులయెడ నీ మనసు ప్రసరించబోకు- కులట లట్లు చేస్తారే కాని కులస్త్రీ లెన్నటికి అట్లాచరించరు.

సర—మీ రేమన్నా సరేకాని కపటనాటకము నాచేత కాదు. చంద్రిక పతివ్రత కా సక్కరలేదా? మీ యాశ్రమములోని వితంతువు లందరూ కులస్త్రీలా కులటలా? వారు మాత్రము తమదేహములను పతుల కర్పించలేదా? ఇప్పు డింకొకరిని వారు వలవనేల? మీరు వారి కెందుకు సాయపడుతూన్నారు.

మనో—వాళ్ళకు పతులు లేరు. వివాహతంతువు తెగినది గనుకనే వారు వితంతువు లైనారు.

సర—బిడియము విడిచి మాట్లాడుతూన్నందుకు నన్ను మన్నించండి. నా పతి యున్నా నాకు లేనివారిలోనే జమ. అతనియందు నాకు ప్రేమ లేదు. తాడుకట్టినాడని అతనికి దాసినై వర్తిస్తూన్నాను. మనసుకు నచ్చిన వాడు కదా మనోవల్లభుడు, మనోనాథుడూ కా దగును. ఒకవేళ మీరు చెప్పినట్లు అతడు నా కీశ్వరుడని యందు



రేమో, నాదేహమున కీశ్వరు డగునే కాని నా మనస్సునకు కాడు. ఉన్నమాట చెప్తూన్నాను, నాగతి వితంతువుకన్న శోచనీయము. ఆమె తనకు నచ్చినవానిని పెండ్లియాడవచ్చు; నా కాపాటి అదృష్టము లేదు.

మనో—నీప్రసంగ మంతా సనాతనధర్మమునకు విపరీతముగా నున్నది.- తాను ప్రేమించినవానినే స్త్రీ పెండ్లియాడవలె ననడము పాశ్చాత్య రీతి, తలిదండ్రు లెంతో ప్రయాసమున వెతికి కూర్చిన పతిని ప్రేమించడము మనరీతి. ఈవాద మిప్పు డనావశ్యకము. నీపతికి నీయం దెంతో ప్రేమ యున్నది. దానికి సంతసించి నీవుకూడా అతనిని ప్రేమించవలెను కాని అన్యులను కలనైనా తలపరాదు.

సర—నాపతి నామాట జవదాటకున్నా నాకు సాంసారిక సుఖము సున్న.

మనో—ఈ వెడబుద్ధికి హేతు వేమి?

సర—ప్రాజ్ఞులైన మీకు తెలియకపోదు; అయినా నానోట వినవలెనని ఉన్నది కాబోలు; చెప్తున్నాను వినండి—వివాహము సములకైనట్టయితే శోభాకరముగా నుంటుంది; అందున్నూ రూపము, గుణము, వయస్సున్నూ ముఖ్యములు. నాబోటి యల్పవయస్కురాలను కట్టుకొని నాపతి నాసుఖమును మట్టిలో కలిపినాడు. ముసలిమగని పొత్తు పడుచుదానికి నచ్చునా? ప్రాయము ననుసరించి మా అభిప్రాయములూ, ఊహలూ, కల్పనలూ, ఆదర్శములూ

విపరీతములు విరుద్ధములు నోటచేత సానుకూల్య మెన్నడైనా చేకూరునా? ఉదయకాల సంధ్యాతుల్యను నేను, సాయంతన సంధ్యారూపు డతడు, అతడు పశ్చిమదెస నుండును, నేను పూర్వదెస నుందును; మా యిద్దరికీ పొత్తు కలుస్తుందా? సంసారసుఖము ననుభవించవలెననే ఉత్సాహముతో నున్నదానను నేను; అన్నిభోగముల ననుభవించి విసికి వేసారి సంసారము సారహీనమని యెంచవలసినవా డతడు-మా యిదరికీ జత కలియడ మేలాగు? తాడు కట్టినమాత్రాన తని తీరునా?

మనో— నీమాటలు ప్రాకృతులకు ప్రత్యయజనకములు కాని ప్రాజ్ఞులకు కావు సుమా. పత్యనుసరణమే సతికి పరమలక్ష్యము, అతనిని దైవముగా భావించి అన్యులను కలలోనైనా తలచుకుండడమే సతికి విధి.

సర— అయ్యా! మీ దయవల్ల ఆ విషయములు నేను గ్రహించినవే. అదృష్టవశమున అనుకూలుడైన పతి లభించిన స్త్రీలకు మీరు చెప్పినదే పరమపదము. నాబోటిదానిమాట?

మనో— నీపతి నీ కనుకూలుడని నీవే చెప్పితివి, నీ మాట చొప్పున నడుచునే కాని అన్య మెరుగడని నీ వనలేదా? నీకేమి కొదవ?

సర— అదే నాకొంప తీసినది, నన్నతడు లొంగించుకొన నసమర్థుడై నాకే తాను లొంగినాడు. నన్ను ప్రాజ్ఞను చేయలేక తానే బాలిశుడైనాడు. రౌతు గుఱ్ఱమును స్వాధీనపర్చుకోవలెను, కాని తాను దానికి లొంగిపో వచ్చునా?



మనో— పతి నిట్లు తిరస్కరించుట పత్నికి తగదు.

సర— పురస్కారమున కర్హులు కానివారి నేమి చేయవలెను?

మనో— నీబోటి కులీన కిది తగదు సుమా.

సర— అయ్యా! మీ రెరుగని దేదీ లేదు. ముడిమాట చెప్పుతున్నాను వినండి- స్త్రీల హృదయమున వినయము, అనురాగము, భక్తి, భయము మొదలైన గుణము లన్నీ తుపాకిమందువలెనే సరియైన పాళ్ళతో మిశ్రితములై యుండును. అనుకూలపురుషుడు కంట పడినతోడనే ఆతనిపై పుట్టు వల పగ్నికణ మౌను. అతడు సానుకూలు డాయెనా ప్రేమరసము స్రవించి మందు నంతటినీ తడిపి ప్రమాదము పరిహరించును. ప్రతికూలు డయ్యెనా హృదయము బగ్గున మండి పఠాలున ప్రేలును. అప్పుడు వినయాది సుగుణములన్నీ ఆధారములేక ఎచటికో పోవును. ఇట్టి పురుషుడు పతియైనా కావచ్చును, అన్యుడైనా కావచ్చును. పతి యనుకూలుడైతే సతి పతివ్రత యౌను, ప్రతికూలు డాయెనా పత్ని త్రికరణశుద్ధిగా పతివ్రత కానేరదు. పతి ప్రతికూలుడైనా అనుకూలుడైన పరపురుషుడు కంటపడకుంటే ప్రమాద ముండదు. అట్టివాడు లభించి నప్పుడు స్త్రీ చిత్త మామె వశమున నుండదు. నాకీ రెండవస్థలూ సంక్రమించినవి-నచ్చనివాడు పతి అయ్యెను, నచ్చిన మీరు కంట

పడ్డారు-మనసులోని మాట చెప్పినాను-ఇక మీ చిత్తము-

మనో—హరిహరీ! (చెవులు మూసుకొని) ఎటువంటి మాటలు చెవిని పడ్డవి! పాపము శమించును గాక! సరస్వతీ! నీకు విద్య నేర్పడమునకు నే నొప్పుకోవడమువల్ల కదా ముప్పు వచ్చినది! అతడు న న్నెంతో విశ్వసించి ని న్నప్పచెప్పి నందుకు నే నతనికి ద్రోహము చేయుదునని నీవు తలపకు. కామోద్రేకము నీ కన్నులు కప్పెను కాని లేకున్న ఈ దురూహ పుట్టినందుకు నీ వెంతో పశ్చాత్తాపము చెంది యుందువు.

సర—నాపతి నా కొనర్చిన యన్యాయమే నన్నిట్లు చేసినది, కావున నా కృత్యమునకు నేను గానీ మీరు గానీ పశ్చాత్తాపపడ నవసరము లేదు-నోరులేనిదాని కంఠమున కురిపోసిన ఘాతకునియెడ విశ్వాస ముండకూడదు, దాని కతని శిక్షిస్తేవిశ్వాసఘాత కాదు. కసితీర్చుకోవడము కదర్యప్రవృత్తి కాదు; ధీర మార్గమే.

మనో—నిజముగా నతడు నీయెడ నపచారము చేసెనే అనుకొందాము. దానికి ప్రతిగా నీ వపచారము చేస్తే నీవు మాత్రము ఘాతకురాలవు కావా? నీగొప్ప యేది? ఆతడు దురాచారుడు దుర్వర్తను డైనయెడల నీవుకసి తీర్చుకొనవలసిన దే. సదాచారవృత్తిని, సద్వర్తనము నవలంబించి పగ దీర్చుకో, లోకులు నిన్ను మెచ్చుతారు, నీకు



సద్గతు లుంటవి-అంతేకాని నీవు వ్యభిచారిణి వైతే లోకులు నిందిస్తారు, దుర్గతులు కల్గుతవి-

సర—అయ్యా, మీ రాదర్శప్రపంచమును గూర్చి ముచ్చటిస్తూన్నారు. ఆచరణమాట యెత్తరేమి?

మనో—ఇహాముత్రఖ్యాతి రాదా? సంఘము మెచ్చుకోదా?

సర—ఇది బాగున్నది-నా జీవిత మంతా ధ్వంస మొనర్చినవారియెడ నాకు దయ పుట్టునా? పసిపాపనైన నాకంఠమున కీ ముసలిముద్ద ఉరితాడు కట్టిననాడు సంఘము సమసిపోయినదా? అప్పు డీదురాచరణమును కన్నులార చూచిన సభాపతులు, పండితులు మొదలైనవారు సదస్సుగా చేరి మమ్మాశీర్వదించి ఫలప్రదానములు కొనిపోయినారే కాని, "ఈ వివాహ మక్రమము- పండువంటి పిల్లను పాడుచేయవద్ద"ని చెప్పడాని కొకరికైనా నాలుక తిరగలేదా? ఇట్టి సంఘము చట్టబండలు కావద్దా? నా కొంపతీసి నాజన్మ మంతా శోకపూరితముగా నొనర్చినవారిని నే నెందుకు మన్నించవలెను?

మనో— నీ బాగోగు లాలోచించవలసినవాళ్ళు నీ తలిదండ్రులు. వా రిష్టపడినప్పుడు సంఘ మెందుకు వద్దన వలెను?

సర—ఒకమాట చెప్పండి. నా తలిదండ్రులు పాడు ధనము చూచి భ్రమపడ్డారే కాని నాసుఖమును గూర్చి రవ్వంతైనా ఆలోచించినారా? నా వివాహము యుక్తమై

కాదని పసిపిల్లకికూడా తెలుస్తుంది. ఇట్టి దురాచరణమును సంఘ మాపకూడదా? నా తలిదండ్రులు చేసిన నేరమునకు ఒకరైనా వారిని శిక్షించినారా? ఇది కూడదని అన్నారా?... ఇప్పుడు నేను పరిహారము చేయదలచినప్పుడు నన్ను వద్దంటారా? తాము శిక్షించక ఒరులను శిక్షించనీయకపోవడమేమైనా బాగున్నదా? ఇట్టి దురాచారము మట్టిలో కలియడ మేలాగు?

మనో—సరే- సంఘమును సంస్కరించవలసినదే ... వెర్రిదానా, సంఘానికి నీవు బుద్ధిచెప్పుతున్నావు కదా? నీవు చేయబోయేది సత్కర్మయేనా? అలాగైతేమేలు. నీవు నింద్యమైన కృత్యమును తలపెట్టి దానిమూలమున హితోపదేశము చేసినట్టయితే నీ మాటకు విలువలేదు, సరేకదా నీకు వచ్చే అపఖ్యాతికి మేరలేదు. చెరసాలలో నొకమూల చీకటికోణమున పడి ఎన్నాళ్ళైనా ఉండవచ్చును కాని పదిమందిచేత వేలు చూపించుకొని సంఘములో మెలగడ మతికష్టము. ఫిరంగిగుండుదెబ్బచేత నొక్కసారి చావవచ్చును కాని యిరుగువారూ పొరుగువారూ మనసు నొచ్చేటట్టు లన్నమాటలు సహింప నలవికాదు. అవమానవహ్ని విషవహ్నికన్న దుర్భరము. నాసంగతి కొంచె మాలోచించు. ఇప్పుడు వివరించిన దుర్గతులు నాకూ ప్రాప్తించతగ్గవే. వీటికన్న బలవత్తరమైన విషయ మింకొకటున్నది. నేను సదాచారుడనని విశ్వసించి ఎంతోమంది ఘరానామనుష్యులు తమకూతుళ్లను, కోడళ్ళను, తోబుట్టువులను నా యాశ్రమమున విడిచినారు. నేను నీచభోగమునకు లొంగి దురాచారవర్తనుడ నయితే వారి నందరినీ దగాచేసినవాడ నవుదును. సంఘసంస్కరణ మనే పవిత్రవ్రతము చేయ సంకల్పించి ఆప్రవృత్తికి మూలనాశనము చేసినట్టయితే ఘనకార్య మొకటి చెడిపోవును. ఇంతే కాదు, ఇంకెవ్వరు దానిని చేయబూనినా సంఘము వారిని విశ్వసింపదు; అందువల్ల దేశాభివృద్ధి అడ్డిపోవును.

సర—మీ దుష్ప్రవర్తనమును దేశమున చాటువారెవరు?

మనో—ఎవరూ చూడరు కదా అని కాబోలు నీ మూఢవిశ్వాసము. ఒకరు చూడనక్కరలేదు, భగవంతుడు లేడా, మనమనస్సాక్షి లేదా? వీరికనుగప్ప నెవ్వరి తరము? పాపము కోడియై కూయును. వెయ్యేల, దురాచారుడనని నీవే రేపు నన్ను గర్హిస్తావు.

సర—ఇన్నిమాట లేల? మీకు నాయందు ప్రేమ లేదనండి.

మనో—ప్రేమకాదు, లాలస లేదను. ప్రేమ పరమపవిత్రము, అదెప్పుడూ సత్పథమున నడచును గాని దుష్పథము తొక్కదు తొక్కనీయదు. నీకు నాయందు నిజమైన ప్రేమ ఉంటే నన్నిట్టికోరిక కోరియుండవు.

సర—ఇన్ని ధర్మవాక్యములు మీరు ఏకరుపెట్టినారు, కాని మనవారిలో గొప్పవారెందరో లాలసావశు

లయినారని పురాణములలో నున్నది. వారేమి తెలివిలేని వారా?

మనో—గొప్పవారు చేసినా రన్నంతమాత్రమున నింద్యకార్యము ప్రశంసనీయ మగునా? సూక్ష్మదృష్టితో చూస్తే వారి కది మచ్చగానే పరిణమించినదనీ, అందువల్ల వారికి కొంత గౌరవహాని సంభవించిందనీ స్పష్ట మవును. వారియందు ఘనత ఉండబట్టి చంద్రునిలో మచ్చ కిరణ కాంతిలో కలిసిన ట్లీ లోపము వారిమహత్వమును తగ్గించలేదు. నాబోటివారిలో ఇతర సామర్థ్యము లేకపోవడముచేత ఈ మచ్చ మాత్రమే నిలిచియుండును. నిజముగా నీవు నా శ్రేయోభిలాషిణి వైతే ఇట్టిప్రసంగమునుండి నీ మానసమును క్రమ్మరించి తీరుతావు. నీ ప్రస్తుతచిత్తవృత్తి మనఉభయులకూ ప్రమాదము తెచ్చిపెట్టి నలుగురినోళ్ళలో పడవేయును. ఇంత ఘోరాపవాదమున కాస్పదవై నీవు జర్రుకొననెంచిన దేమిటి? విషయసౌఖ్యము. అది శాశ్వతమా? కాదు, క్షణికము; గౌరవాపాదకమా? కాదు, తిరస్కార్యము; అతిమానుష మా? కాదు, పాశవము. ప్రశంసనీయమా? కాదు, నింద్యము. సరస్వతీ! అట్టి నశ్వరమూ, నాశకరమూ, గర్హ్యమునైన పని చేయడమునకు నీ మన స్సొప్పుతుందా? చక్కగా నాలోచించు. యవ్వనమదము అధోగతికి నిన్ను దిగలాగుతూన్నది, దాని నణచి ఉత్తమప్రవృత్త్యావేశాగ్ని నీహృదయమున ప్రజ్వలించి కండకొవ్వు కరిగించు.



సర—మీ చిత్తస్థైర్యము చూస్తే నాకు లజ్జ పుట్టుతూన్నది. ఇక నాకోరిక కోరను, కాని యింకొకటి కోరుతాను, నెరవేరుస్తారా?

మనో—దురాచారము కాకున్న అట్లే చేస్తాను.

సర—మీ రప్పుడైనన్నూ ఒక్కసారియైన నాకంట పడుతూ ఉంటారా?

మనో—గ్రామములో నున్నంతకాల మట్లే చేసెదను. నేను చాలా కాల మయింది, ఆశ్రమమునకు పోయి వస్తాను.

సర—ఇంత రాత్రివేళనే! తెల్లవారినపిదప పోకూడదా?

మనో—చకోరు డూరలేడు-ఆశ్రమమునకు నేను పోయితీరవలెను.

సర—నేను గాత్రవితంతువు శరణాలయమునకు వచ్చినదట?

మనో—(స్వ) అక్కడి కిదివరకు నేను పోలేదు. చకోరుడు తరంగిణి కభ్యర్థన మిచ్చియుండవచ్చును. (ప్ర) సావకాశముగా నామె వృత్తాంతము చెప్పెదను...(పోవును)

సర—చక్కని చానను చిన్నదానినని ఈతనిని వశపరచుకొందుననీ గర్వించినందుకు తగిన శాస్తి యైనది.... ఇది యొకవిధముగా మేలే. శాస్త్రిని నేను మోహించనట్టే ఈతడు నన్ను మోహించలేదు. ఇక నేనీ వ్యాపారమునుండి

16

నా చిత్తమును మరలిస్తాన....కొత్తయువతిప్రసంగ మెత్త గానే ఈత డేలనో సంకోచించి మారుమాటాడక వెళ్ళి పోయెను. ఇందే దైనా రహస్య ముంది కాబోలు? నిలకడ మీద కాని నిజము తేలదు. ఇత డామె వలలో పడినట్లు యితే నా కితడు చేసిన హితబోధకు తగిన ప్రతిక్రియ చేయ వచ్చును. (తెర పడును)

---

—॥ మూడో రంగము బడి ॥—

విహారుడు

విహా—సర్వకాలసర్వావస్థలయందున్నూ నా ప్రేయసి రూపము నన్ను బాయకున్నది. తరంగిణీ! నీకు నాపై నెట్టి ప్రేమ యున్నదో నాకూ నీపై నట్టిప్రేమయే కలదు. నీగుణ పరిచయము చేతనే స్త్రీజాతియందు నాకు గౌరవము జనించి నది. నీవు నన్ను బాసిన పిమ్మట నే నేపని చేయబూనినా నీ విగ్రహమే నాకళ్ళకు కట్టినట్లుండి, పరధ్యానము, మరపు, నిశ్చలత నాకు సంక్రమిస్తూన్నవి. బడి పెట్టినాను కాని పాఠ ములు చెప్పడానికి మనసు కుదురదే? బాలురకు ప్రతిదిన మూటవిడుపువలెనే యున్నది, వారికి నా మాటయందు లక్ష్యము లేదు.

(చకోరుడు వచ్చును)

చకో—బావగారూ! ఏమి విశేషాలు? మీవ్రతము నిర్విఘ్నముగా సాగుతూన్నదా?



విహా—నామాట కేమిగాని, నీసోదరి యిప్పు డెక్కడ నున్నదో చెప్పు.

చకో—(స్వ) మా పన్నుగడ యితనికి తెలిసిందా ఏమి? (ప్ర) నే నెరుగను.

విహా—ఇదిగో నా యెదుట, వెనుక, ఇరుపక్కలా ఎక్కడ చూచినా తరంగిణియే కనబడుతూన్నది- నావ్రత మవిచ్ఛిన్నముగా సాగుతూన్నది.

చకో—గాఢానురాగ మిలాగే ఉంటుంది.

విహా—నాకు జగమంతా తరంగిణీమయముగా నుంది.

చకో—మీబడి సరిగా జరుగుతూన్నదా?

విహా—ఈ వ్యవసాయము నా చిత్తవృత్తి కనుకూల ముగా లేదు. బాలురకు విద్యనేర్పడము కష్టము. బాలికా పాఠశాలలైన ఇంత బాధ లేకపోవును. వాళ్లు తుంటరులయి నారు. వారి యల్లరి కంతములేదు. చదువునం దాసక్తి ఒక రికీ లేదు. వారందరూ పనిలేక బడికి వస్తూన్నట్లున్నారు.

చకో—ఇదేమి యతివేషము వేసినారు?

విహా—ఈ వేషముతోనున్నప్పుడు నిన్ను పరాభవించి నాను కనుక నా కిట్టి దైన్యావస్థ దాపురించింది. పాపపరిహా రార్థము పరివ్రాజక వేషము ధరించినాను.

చకో—మీ కీబడి సరిపడినది కాదు గనుక మా యాశ్రమమున బాలికలకు విద్యనేర్పుతారా?

విహా—నా కది సమ్మతమే కాని మొన్నటిదాకా ఆశ్రమమునూ దానిని స్థాపించిన మీసోదరులనూ అనరాని మాట లని నే డేమొగముతో నక్కడ జేరుదునా అని శంకిస్తున్నాను.

చకో—గతమును గురించి చింతిల్లనక్కరలేదు, మీ రక్కడ అధ్యాపన చేస్తారంటే మాకిద్దరికీ పరమానందము.

విహా—ఇంతకన్న కావలసిన దేమి? తప్పకుండా వస్తాను.

చకో—అవశ్య మట్లు చేయవచ్చును కాని రెండు మాటలు మీతో చెప్పవలసియున్నది.

విహా—ఆహా, సావధానుడను.

చకో—అక్కయ్యను గురించి మీ రన్నయ్యతో నెప్పుడూ ప్రస్తావించరాదు. మీ కిప్పు డామె పేరే మూల మంత్రముగా నున్నది కనుక కడుజాగరూకులై యుండవలెను.

విహా—అట్లే కానీ-రెండో దేమిటి?

చకో—ప్రస్తుతమున మా యాశ్రమములోకి క్రొత్తగా నొక శ్రీమంతురాలు వచ్చి బాలికలకు విద్య నేర్పుతూన్నది-ఆమె యువతి, మంచిరూపసి అని వదంతి, మా సోదరులతోనే ఆమె మాటాడును. మేలిముసుగు వేసుకోకుండా బయటికి రాదు...మీరూ క్రొత్తవారు గనుక మనవిచేస్తున్నాను. ఆమె గదివైపు పోకూడదు. పురుషుల యెదుట పడనని ఆమె ప్రతిజ్ఞ.



విహా—చకోరా! పరసతులు నాకు నాతల్లులని నా భావన- ఇదికూడా నా వ్రతములోదే.

చకో—ఇక మీరు తడయరాదు.

విహా—నే నీపాఠశాల ముగించి మానాన్నగారితో మాటలాడి ఆశ్రమము చేరుకొంటాను...

---

## —నాలుగో రంగము, శరణాలయము—

(మనోహరుడు, తరంగిణి.)

మనో—అమ్మా! నీ కిక్కడ సుఖముగా కాలక్షేపమవుతూన్నాదా?

తరం—ఎందూ కొరత లేదు. అన్నా! ఏమి నీ సంవిధాన చాతుర్యము! నిస్తులాన్నోదకములూ, నిష్కళంక దేహములూ, నిర్మలాంతఃకరణములు, నిశ్చింతాజీవనము కలిగినచోట సుఖము కేమి కొదవ? ఇచ్చటి దినచర్య నాకు బహుచిత్రమని తోచడమే కాక అత్యంతోపయోగకరమని విశ్వాసము కలిగినది. ఇక్కడ నేర్పినవిద్య నిరర్థకము కాదు. ప్రతివారున్నూ చదువు వ్రాతయూ నేర్చుకొని వంట వంతులప్రకారము చేసుకొందురు. పురుషుని ప్రమేయము లేకుండా గృహచర్య నడుపునేర్పు ప్రతివారికీ కద్దు. పైతరగతి బాలికలు కిందివారికి విద్యనేర్పి అధ్యాపనమున నారితేరుతున్నారు. మీ బావగారు దీనిని వ్యత్యస్తము గా

వర్ణిస్తూండేవారు. ఆభ్రాంతి పోతేవారు మీతోకలిసి పాటు పడతారని నా నమ్మకము.

మనో——ఇలాగే ప్రత్యక్షజ్ఞానములేక అపోహాములు కల్పించుకొని సంస్కారపరాఙ్ముఖు లయినవారు చాలామంది ఉన్నారు. మేము పదిసారులు పిలిచినా వచ్చి చూడరు; ఈర్ష్యావేశులై నిజము తెలియక మమ్ము నిందిస్తారు. అందుకే బావగారిని తీసుకొని రావడమునకు చకోరుడు నేడు వెళ్ళినాడు.

తర——అమ్మయ్యో! ఇం కేముంది? మన పన్నాగ మాయనకంట పడితే మొదటికే మోసము వస్తుంది. ఆయన వచ్చినతరువాత నాగురించి నీతో ప్రస్తావించక మానరు, నీవు నిజము చెప్పి తీరుతావు. ఈకుట్రలో నేనుకూడా చేరి నానని మరి నా ముఖమే చూడరు.

మనో——అతడు రాగానే నే నిక్కడ నుండను (ఒక బాలిక వచ్చును.)

బాలి——అయ్యా! ఎవరో విహారు డట, ఇద్దరుస్త్రీలను వెంటబెట్టుకొని వచ్చినారు.

మనో——లోనికి రమ్మను. నే నీ రెండోద్వారమున పోతాను. (వెళ్ళును)

తరం——ప్రాణేశ్వరుని చూడవలెనని నా హృదయము తత్తరపడుతూన్నది. అదే వాళ్ళువస్తూన్న టున్నది. (ముసుగు వేసుకొనును, విహారుడు, సరస్వతి, వేణమ్మ వత్తురు)



చకో——కళ్యాణీదేవిగారూ, వీరు మా బావగారు, మన యాశ్రమమున అధ్యాపకత్వము చేయవలెనని నేడేవచ్చి నారు.

తరం——(మారుస్వరముతో) సంతోషము- సర్వసంగ పరిత్యాగ మొనర్చి మన యాశ్రమమున పనిచేసే స్వేచ్ఛా సేవకులు మనకు కావలసియున్నారు.

విహా——మీబోటి ఆగర్భశ్రీమంతులుకూడా పరోప కారబుద్ధితో పనిచేయడము వింతగా నున్నది. మాబోంట్లో లెక్కా?

తరం——వీరి సోదరియా ఈమె?

చకో——కాదు. వారి సాపత్నిమాత సరస్వతి; మన ఆశ్రమమును చూడవలెనని వచ్చినది.

సర——(స్వ) ఈమె సర్వాంగసుందరి, నా గునువుగా రీమె వలలో చిక్కియుందురు. అట్లు కాకున్న నన్ను ధిక్క రింతురా?

విహా——మనోహరరావు పంతులుగా రిక్క డుందురని వచ్చినాము- మీపని కడ్డువచ్చినందుకు మమ్ము క్షమించండి.

తరం——ఇంతవరకూ వా రిక్కడనే యుండి పనిమీద ఊరికి పోయినారు.

విహా——(స్వ) ఏమి ఈ మోహనాంగి లావణ్యము! మొగము కప్పియున్నా శరీర లావణ్యము స్పష్టముగా కనబడు తూన్నది.

సర—(స్వ) ఇంతవరకు మెతో ముచ్చటలాడి మేము వచ్చినామని పంతులుగారు దాటినారు. నా అనుమానము నకు కారణము లేకపోలేదు.

విహా—యజమానిగారి దర్శనము కాకుండా ఆశ్రమమున కూర్చుండడము భావ్యము కాదు గనుక మా యింటికి బోతాము, సెలవివ్వండి.

తరం—మన మేక కార్యావలంబకులము కావున మనకు మైత్రి చేకూరినది. కావున త్వరలో పునర్దర్శన మీయవలెనని ప్రార్థిస్తున్నాను.

సర—(స్వ) అబ్బో! ఈమె నెరజాణ, క్షణములో నెట్టివాళ్ళనైనా బుట్టలో వేయగలదు. నేను పట్టి అమాయికను గనుక కల్లబొల్లిమాటలు కొన్ని చెప్పి నా యాశాంకూరమును మొదలంటా ఊడదీసినారు. ఈమె నాతను వలచుట నిశ్చయము కనుక నే నన్ను తూలగొట్టినాడు. నావద్ద నితని యాటలు సాగినవి కాని ఈమెయెడ సాగిరావు...

(పోవుదురు)

తరం—అహా! పురుషు లెంత చలచిత్తులు! సుందరి కంటపడిన చాలును; భార్య పశ్చిమగణ్యయే కదా? నా నాథుడు నేను పరస్త్రీనని ఎరిగియుండీ నావైపు కోరచూపులు చూచినాడు. మాటలు మెత్తనివే కాని క్రీగంటిచూపులు హృదయదారణములు. ఇదేనా నా యందలి ప్రేమ? ఇంకో సుందరివైపూ ఇట్లే చూచి ఈలాగే ప్రస్తావించును కదా!



మగవారిని నమ్మరాదు, వారు నూతన ప్రియులు; ఎదుటనున్నదే వారికి తాత్కాలిక శ్రేయసి. కానీ, ఇంకా నిరీక్షించి చూస్తాను—

సర—అత డీమెకు లొంగినట్లు నిర్ధారితమయినదంటే అతనిపని పట్టి తీరుతాను.

---

—*** ఐదో రంగము ***—

విహారు నిల్లు.

చంద్రిక వేణమ్మ.

వేణ—అమ్మాయిగారూ, నా పాపిష్ఠి వృత్తాంతము తెలిసింది కదా?...నా ముద్దుపాపని గొంతు నొక్కి ఆచండాలుడు చంపినాడనీ సర్కారువారీయంశమును పరిశోధిస్తూన్నారనీ తెలియకుంటే నా పాపచరిత్ర బైటపెట్టకపోవుదును. అభము శుభము నెరుగని యర్భకునికి జనకుడే యముడౌనని ఊహించలేకపోతిని, లేకుంటే ఇంకొకరిచేత పంపియుందును. నే నాపసివానికి తల్లిని కాను, గర్భశత్రువును కనుక నే భూమిమీద వాడుపడగానే భూమిలో పూడ్చినాను. ఈపాపసృష్టికి మూలకారణుడైన ఈ చండాలునికి మరణము రాదాయె... ఇం కెందరి శీలము మలినము చేయవలెనో, ఎన్ని భ్రూణహత్యలు జరుపవలెనో?

చంద్రి—శోకించి యేమి ప్రయోజనము, ఆ పాపడు బ్రతుకడు కదా?

వేణ—చేతులార చంపుకొన్న బిడ్డ జీవించునా? నేనే నా బిడ్డను చేరుతాను, ఇక నీలోకమున నా కేముంది?

చంద్రి—నీ మాటలు రాళ్లనైనా కరిగించగలవు.

వేణు—ఆ పాపాత్ముని హృదయము బండకన్న గట్టిది. పరమేశ్వరుడు వాని కేమిగతి పెట్టనున్నాడో?

చంద్రి—వాని కిహమునా పరమునా ఘోరశిక్ష కాక తప్పదు.

సేవ—అమ్మాయిగారూ, శాస్త్రిలుగారు దయచేసినారు.

చంద్రి—వారిని పంపి నీ వీ దగ్గరనే దాగియుండు. (సేవకుడు పోవును) వేణమ్మగారూ, మీరుకూడా పొండి. (ఆమె పోవును) అన్నయ్య ఆశ్రమానికి వెళ్లినప్పటినుంచీ ఈమె నాకు తోడుగా నుండడము మేలైనది, లేకున్న కాలయాపన మతికష్టముగా నుండియుండును. ఇటువంటివారు సంఘములో నెందరో వయస్సు గతించకపోవడమువల్ల కామము తగ్గక దాంపత్యసుఖ మనుభవింప వీలు లేకపోవడముచేత రహస్యముగా నెన్నో పాపము లాచరిస్తూన్నారు. గత్యంతరము లేక కక్కుర్తికి గడంగినారు. (శాస్త్రి వచ్చును)

హరి—(స్వ) నాకు సరస్వతి వెర్రి పట్టినన్నాళ్లూ దీని దెస నా దృష్టి ప్రసరించలేదు. ఇటీవల దీని లావణ్యము నా చిత్తము నాకర్షించినది. ఆహా! దీని ముఖము నిష్కళంకుడైన చంద్రుని పోలియున్నది. దీని నెలాగైనా లొంగించుకొంటినా



సుఖము దక్కడమే కాక సరస్వతిపై పగ చక్కగా తీర్చుకో వచ్చును. (ప్ర) ఏమి చంద్రికా! శరీరములో స్వస్థత చేకూరినదా?

చంద్రి—ఆ—నాబోటిదానికి స్వస్థతా లోపముండదు. పాపికి చిరాయు వుండునట కాదా?

హరి—చకోరుడు ఆశ్రమమున హాయిగా నున్నాడని వాడుక.

చంద్రి—ఏమో? ఆతని సంగతి నా కెందుకు? అతడేలాగునున్న నాకేమి?

హరి—ఇటీవల ఆతని వృత్తాంతము నీ వెరుగనట్లుంది?

చంద్రి—నే నావిషయమే యెరుగను.

హరి—అహర్నిశ మాతనికి తీరికలేని పని దొరికింది.

చంద్రి—ఏమి పని?

హరి—ఆశ్రమానికి పిన్నవయస్సుగల సతీమణి కొత్తగా వచ్చిందట. ఆమె కధ్యాపనమార్గములు బోధించుమని చకోరుని నియమించినారట...ఇంకో చిత్రము- ఆమె యపురూప సుందరియట; పురుషులకంట పడితే ప్రమాదము వచ్చుననో లేక దృష్టిదోషము తగులుతుందనో మేలిముసుగు వేసుకొనునట! చకోరునితో తప్ప యితరపురుషులతో మాటాడదట!

చంద్రి—కొత్తగా నొకర్తె వచ్చినమాట విన్నాను, కాని అతని కామెపరిచయ మున్నట్లు తెలియలేదు.

హరి—అది పరమరహస్యము. ఆమె గదిదగ్గరకు మనోహరుడూ చకోరుడూ తప్ప యితరపురుషులు పోకూడదట; గదిలోనికి చకోరుడుతప్ప వేరెవ్వరూ పోరట. అవేమి కట్టుబాట్లో?

చంద్రి—ఈ ప్రశంస నావద్ద నెత్తినందువలన మీ కేమి ప్రయోజనము?

హరి—వారిని చూచి నేర్చుకోవడమే ప్రయోజనము. చకోరుడు నిన్నధఃకరించి, ఇంకొకర్తెతో చెలిమిచేసుకొన్నాడు; నీవుకూడా అలాగే చేయరాదా?

చంద్రి—ఏమన్నారు?

హరి—కోపము వద్దు. మిసమిసలాడు నీలావణ్యము వైధవ్యదీక్షచేత నిష్ఫల మెందుకు కావలెను? భగవంతుడు ప్రసాదించిన నీరూప మన్యాయత్తము చేస్తేకదా అది సఫలము కాగలదు. ధనముండీ అనుభవించనేరని లుబ్ధునివలెనే నీ చక్కదనము నొరులకర్పించకుంటే నీ కేమి సుఖము?

చంద్రి—ఒంటరిగా నున్న యుక్తవయస్సువచ్చిన వితంతువుతో నిట్లు ప్రసంగించకూడునా?

హరి—చకోరుడు నీతో నిట్టి ప్రసంగము చేయవచ్చును కాబోలు?

చంద్రి—మాటిమాటి కతనిపేరెత్తెద వేమి! నీవీక్షణ మిక్కడనుండి పోయెదవా? లేక బలవంతముగా పంపవలెనా?



హరి—అబ్బా! ఎంత పోకిరివి! దీనికి తగినశిక్ష నా చేతిలో నున్నదిలే-కిందూ మీదూ చూడకున్నావు. జుట్టు గొరిగించి ఒకమూల కూర్చుండబెట్టగలను సుమా!

చంద్రి—నీ వేమిచేసినా సరే, నీ లక్ష్యము నాకులేదు నడువుము. సేవకా, ఈతని నావలకు పంపి తలుపు వేసి రమ్ము.

---

—ఆరో రంగము—అనాథశరణాలయము.

విహారుడు.

విహా—అదేమి చిత్రమో కాని కళ్యాణికిన్నీ నా తరంగిణికిన్నీ రూప సాదృశ్య ముండడముచేత కాబోలు నా చిత్తము కళ్యాణివైపు పరుగెత్తుతూన్నది. మేలిముసుగులోని దాని హాస్యము సంచిలోని వెండివలెనే రాజిల్లుతూన్నది. ఆమె వితంతువౌట నా కక్కరకురాదు. అవివాహితుడనై యుందునని ప్రమాణము చేయడము ప్రమాదమయినది. చకోరుడామెతో చాలా కాల మేకాంతముగా ముచ్చటిస్తూండును, వాడామె నపహరించదలచిన ట్లుంది. అందుకే ఆమెతో నన్ను సంభాషించ వద్దన్నాడు. ఎందుచేతనో కాని దానికి నాపై అనురాగ మున్నట్లున్నది. ఆలత శోషిల్లును కదా అనే చింత నన్ను బాధిస్తూన్నది. (బాలికలు వచ్చి కూర్చుందురు.) ఇక నీ ప్రసంగము విడిచి పిల్లకు పాఠము చెప్పవలెను...నిన్న నెంతవర కయింది?

బాలిక—రావణుడు సీతను లంకకు కొనిపోయెను.

విహా—సరే, వినండి- ఈప్రకారంగా రావణాసురుని చేత బాధించబడిన కళ్యాణి—

బాలిక—ఏమండోయి తప్పు చెప్పుతూన్నారు? కళ్యాణి కాదు సీత.

విహా—(స్వ) అన్నా చిక్కు వచ్చిందే; కళ్యాణి కీర్తి కంటిచూపు నాపైని పడినప్పటినుండీ నన్నామె చింత వేధిస్తూన్నది. కాని యిప్పటికి తప్పు కొంటాను. కళ్యాణి అనేది నేను జాతి వాచకముగా వాడినాను-కళ్యాణి అంటేశుభప్రదమైన కాంత అన్నమాట. (హరిహరశాస్త్రి వచ్చును.)

హరి—అయ్యా! మీతో జరుగురుగా రెండుమాటలాడవలసియున్నది.

విహా—మీ పాఠము రేపు చెప్పుతాను-ఇప్పుడు పొండి...ఏమి శాస్త్రిలుగారూ! ఇంతదూరము వచ్చినారు?

హరి—మీకు పత్నీవిరహము ప్రాప్తించిన తరువాత నాయందు బొత్తిగా దయ తప్పినది.

విహా—లేదులేదు- నాతలవ్రాతకు మీ రేమి చేయగలరు?

హరి—చంద్రికకు ధర్మశాస్త్రరీత్యా కేశఖండనము చేయించవలెనని మీతో నెన్ని సార్లో చెప్పినాను. మీ రసడ్డ చేసినారు. మీ రింటివద్ద నున్నంతకాలము ఏ యిబ్బందీ లేక పోయెను. ఇప్పుడో సాయంసమయమున ఆమె సర్వాభరణ



ములూ ధరించి తలవాకి లిల్లుగా నిలిచి వచ్చిన పురుషులతో యిష్టమువచ్చినంతసేపు సల్లాపము జరుపుతూన్నది! మీ మేలు కోరిన వాడను కావున మీకు తెలియజేసినాను-పిమ్మట మీ చిత్తము.

విహా—ఏమి దాని దుండగము! బైట కూర్చుంటూన్నదా?

హరి—అంతే కాదు-ఇది నీకు తగదని నేను చెప్పబోగా నేను తన్ను బలవంతపెట్టినానని రంధి పెట్టింది.

విహా—తల్లికి పట్టురా వసంత మన్నట్లు మీబోటి సత్పురుషులపై నింద మోపినదా? ఉండండి-దాని వీపు బద్దలుగొట్టుతాను.

హరి—స్త్రీలకు దేహశిక్ష కూడదు.

విహా—మిమ్మవమానించిన దానియెడ దయదాలుస్తున్నారు. ఎంతటి ధర్మరాజు లండీ మీరు!

హరి—దుష్టవృక్షమునకు మూలము ఛేదించవలెను, కాని కొమ్మలు నరుకుతే నేమి ప్రయోజనము? వపనము చేయిస్తే ఇక దానివంక నెవ్వరూ తొంగిచూడరు. అది నలుగురిలో కలియలేదు; ఇక నిట్టి వెర్రిబుద్ధులు పుట్టవు. దుస్సాంగత్యమువల్ల చెడిపోయినది గాని చంద్రిక చాలా బుద్ధిమంతురాలు.

విహా—అవశ్యమాలాగే చేతాము. నా కిప్పుడు తెరపి లేదు. అందుకు కావలసిన ఏర్పాటులన్నీ మీరేచేయించండి,

ఒకవేళ చంద్రిక హఠముచేత మీమాట వినదేమో? తత్పరిహారార్థము ఉత్తరము వ్రాసి యిస్తాను, అది దానికిస్తే మీకే యాటంక ముండదు.

హరి—సరేకాని, చకోరు డడ్డుపెట్టునేమో?

విహా—ఇది ముందే నేను యోచించినాను. వాడిప్పుడు చంద్రికను వాంఛించలేదు-వాడిదృష్టి కళ్యాణిపరమైనది. వాని లోకమంతా యిప్పుడు కళ్యాణీమయముగానుంది (జాబు వ్రాయును.)

హరి— (తనలో) తానే కన్నము వేసి పైపెచ్చు "దొంగ, దొంగ" అని కేకలువేసినట్లుంది చకోరుని కథ... నాప్రయత్నమున కడ్డువచ్చిన చంద్రిక కిట్టి శాస్తి కావలసినదే!

విహా—ఇదిగో ఉత్తరము. దానిని సముద్రతీరమునకు కొనిపోవునప్పు డెవ్వరైనా సాయముండవలెను కదా? అదీ ఉదాహరించినాను.

హరి—(పోవుచూ) కొత్తనీరు వచ్చి పాతనీటిని కొనిపోయినదట. మొన్నటిదాకా చంద్రికను పెళ్ళిచేసుకోవలెనని ఉబలాటముతో నున్నవాడు కళ్యాణిని చూడగానే చంద్రికను మరచిపోయినాడు. అదీ వానిని మరచింది, ఇంకెవరిమీద కన్ను వేయగలదో చూస్తాను. నేను దీనికి తగనేమి?

(వెళ్లును)



(చకోరుడు వచ్చును)

చకో— మీ రిద్దరే మాలోచిస్తూన్నారు? చంద్రికను విరూపను చేయవలెనని కుట్ర పన్నుతూన్నారా?

విహా—దాని నెత్తిమీద జుట్టున్నంతకాలము మా నెత్తిమీద వెంట్రుక లుంచకున్నారు. అదీ పదిమందినోళ్లలో పడుతూన్నది. కొద్దికాల మిట్లుంటే ఆమె పెడదారికూడా పట్టేటట్లున్నది. మే మిప్పుడు చేయదలచిన దామె మేలుకే.

చకో—ఈనీచుని మాటలు విని ఎంత దుష్కార్యము చేయ నిశ్చయించినారు!...వీని కామెపై పాపదృష్టి కలదని తెలిసినది... ఈ చండాలుడు కేశఖండన మనే భీతి గొలిపి ఆమెను వశపర్చుకోవలెనని యత్నించి విఫలుడైన తోడనే ఆమెపై అపదూరు మోపి కృతకృత్యుడు కావలెనని యెంచినాడు. నేను చంద్రికకే అపాయమూ లేకుండా కాచుకొని యున్నాను. మీరనుకొన్నట్లు నేను కళ్యాణి చెంత నుండలేదు- ఆ సమయములందు మీయింటివద్ద నుంటూన్నాను.

విహా—నీవు కళ్యాణిని మోహించలేదా?

చకో—రామరామ- ఆమెయెడ సోదరభావమున మెలగుతూన్నాను. దైవమే యిందుకు సాక్షి.

విహా—ఇపు డేమి చేయు మన్నావు?

చకో—ఈ నరాధముడు చంద్రికను సముద్రతీరమునకు కొనిపోయి అవమానించితీరును...కావున ఆమెకే

యపాయమూ రాకుండా ఏర్పాటుచేసి వీలుంటే వానిని చితగ తన్నెదను.

విహా—వీని సంగతి నే నిదివర కెరుగకపోవడముచేత మోసపోయినాను, ఇప్పుడు వీని స్వభావము తెలిసింది. నీ చిత్తమువచ్చినట్లు చేయవచ్చును.

చకో—అలాగైతే ఈ విషయము తెల్పుతూ చంద్రిక కొక ఉత్తరము వ్రాసి నాచేతి కివ్వండి.

విహా—అలాగే చేస్తాను (జాబువ్రాయును)

చకో—(స్వ) కేవల సరళమనస్కుడు- అక్కయ్య గతించినదని నమ్మికొని మనసు వికల మొనర్చుకొన్నాడు. శాస్త్రి జా బడిగితే వాని కిచ్చినాడు. నే నడిగితే నా కిచ్చినాడు- తిరిగీ శాస్త్రి లడిగితే వాని కిచ్చునేమో? కావున జాగ్రత్తగా కనిపెట్టుతూండవలెను.

విహా—చకోరుడు కళ్యాణిని మోహించలేదని విన్నప్పటినుంచీ నా కమితానందము కల్గినది. అతడుగానీ మనోహరుడుగాని ఆశ్రమములోని వితంతువులను వివాహము చేసుకుంటే అది యభివృద్ధి చెందదు. ఆశ్రమగౌరవమునకు హాని రాకుండా వారు మెలగితీరవలెను....ఇక నా మాట- నాప్రేయసి అకాలమృత్యువువాత బడినది, ఇక నాకు లభించదు. కళ్యాణి నన్ను ప్రేమించిన ట్లుందికాని వితంతువు కావడముచేత నాకు లభించనేరదు. నాకష్టము గట్టెక్కడ మెప్పటికో?

---




## —ఐదో అంకము—

---

మొదటి రంగము-విహారునిల్లు.

చంద్రిక-వేణమ్మ.

వేణ—మీ అన్నగారు వ్రాసినంత మాత్రాన మీ రట్లు నడుచుకోవలెనా?

చంద్రి—స్త్రీలకు స్వాతంత్ర్యము లేదు; యావజ్జీవమితరుల ఆశ్రయమున నుండవలెను. నాన్నగా రింటనే నున్నప్పుడు నా కవమానము సిద్ధ మయ్యెను; అప్పుడు మా అన్న దానినుండి తప్పించి కంటిని రెప్పవలె నన్ను గాచుతూన్నాడు- అట్టి శ్రేయోభిలాషిమాట నేను త్రోసివేయగలనా? అతనియెడ నపచారము నేను చేయగూడునా?

వేణ—నే నెంత కొరగానిదాన నైనా ఎవరినీ నాతల నంటనీయలేదు. మీరు గొప్పయింటి యాడపడుచులు కదా మిమ్మొక మురికిముంగలి యంటగూడునా? మన దేశౌన్నత్యము తక్కిన విషయములందు తగ్గినా నారీగౌరవము

మాత్రము నశించలేదు. దానిని కూడా కోలుపోతే ఇక మన మగవారు గాజులు తొడిగించుకొని అంతఃపురములందుండవలసినదే.

చంద్రి—మన దేశమం దెందరో వితంతువు లున్నారు, వారందరూ క్షురకర్మ కొప్పుకొన్నారు. నేనొక్కర్తె నట్లు చేయకుంటే తీరునా? అదీకాక ఆడదానికి కొప్పే పస. నాకు దానితో పని తీరినది. నాప్రియుని స్నేహమే యింతవరకూ దానిని పెంచెను. ఆస్నేహ మిప్పు డన్యమార్గము పట్టింది, ఇక నాకు జుట్టేల?

వేణ—మీరీ కపటి స్వార్థపరుడునైన శాస్త్రిమాటలు నిజమని నమ్మి నిరాశ వహించినారు. అతనిమాట లబద్ధము. చకోరుని స్వభావ మట్టిదికాదని నా నమ్మకము.

చంద్రి—మగవారు నూతనప్రియులు. వారి ప్రేమ కళ్లయందూ మాటలయందు నుండునుగాని హృదయమందుండదు. ఇందుకుతోడొకమాయలమారి యీయాశ్రమము చేరింది, అది ధనవంతురాలు, రూపసిఅట; యశస్కాములైన యువకులామెవలలో పడినారంటే వింతకాదు.

వేణ— ఒకసారి చకోరునితో ప్రస్తావిస్తే నిజము తెలుసును, ఆపైని మీచిత్తమువచ్చినట్లు చేయవచ్చును.

చంద్రి—ఆమాట నిజమే కాని అందు కవకాశ మేదీ? సమీపించిందికదా శాస్త్రిలుగారు పెట్టిన ముహూర్తము... ఇప్పుడు వీనిభయమే నన్ను బాధిస్తూన్నది. ఈరాత్రి నన్నే



మిచేయునో అనే శంక పీడిస్తూన్నది.

వేణ—మీ కాచింత వద్దు. మీమనుష్యు లున్నారు. నా కంఠములో జీవ మున్నంతకాలము వాడు మి మ్మంటకుండా చేసే భారము నాది. (సేవకుడు వచ్చును)

సేవ—అమ్మాయిగారూ, చకోరంగారు వచ్చినారు.

వేణ—వారిని రమ్మను. అమ్మాయిగారూ, తలపని తలంపుగా నాతడే వచ్చెను కదా, ముడిమాట అడగండి. ఇక నతని జోలి మీ కక్కరలేదు గనుక అన్ని సంగతులూ అడుగండి. మీకు మొగమాట మయితే ఆపని నా కొప్పగించండి, నిక్కచ్చిగా అన్నీ అడుగుతాను.

చకో—(స్వ) చంద్రిక మనస్సు దిట్టబరుచుకొని యుండును. (ప్ర) చంద్రికా, బావగారు వ్రాసినప్రకార మాచరించవలెనని నీవు నిర్ధారణ చేసుకొన్నట్టుంది?

చంద్రి—వారియాజ్ఞ నాకనుల్లంఘ్యము కాదా?

చకో—ఆతడు తన నిర్ణయమును మార్చుకొన్నాడని చెప్పడమునకే వచ్చినాను.

చంద్రి—క్షణక్షణమునకూ తన అభిప్రాయములు మార్చుకొనేవాడు కాడు మాయన్న.

చకో—నామాటయందు నీకు విశ్వాసము లేదా? విశ్వాసమునకు ప్రేమయే ప్రాణము. ప్రేమ పోతేనే కాని విశ్వాసము పోదు. ఇంత పరివర్తనమునకు హేతువైన ప్రమాదము నావల్ల నేమి జరిగినది?

చంద్రి—మీకు నాయం దుండిన ప్రేమ పోగానే మీయందు నాకున్న విశ్వాసమూ తొలగినది.

చకో—కళ్యాణివృత్తాంత మేనా దీనికి హేతువు?

చంద్రి—మీ కట్టి యనుమాన మెందుకు కలిగింది?

చకో—ఇట్టిభ్రాంతి చాలమందికి కలిగినది. నీ కొక్కర్తెకే కాదు.

చంద్రి—ఆలాగైతే నా యభిప్రాయము సహేతుకమే! మగవారు మహారాజులు, వారిమాటలు తూర్పునకు పోతే మనసు పశ్చిమానికి పరుగెత్తుతుంది. వారి నెవ్వరే మనగలరు?

చకో—ఈవిషయమున మీయన్నకూ ఇదే సందేహము కల్గితే దానిని తీర్చవలసివచ్చినది...ఒక్కమాట విను, దైవ సాక్షిగా చెప్పుతున్నాను. కళ్యాణి నాసోదరియనే భావమున మెలగుతూన్నాను కాని అన్యము కాదు.

చంద్రి—అట్లయితే ఆమెతో నేకాంతముగా చాలా సేపు ప్రసంగించడమునకు హేతువేమి?

చకో—(నవ్వి) అది కొద్దికాలములో ప్రపంచమునకు వ్యక్తము కాగలదు. ఇట్టి లేనిపోని సంశయములు పుట్టడము మా యాశ్రమక్షేమమునకు ప్రతికూలము కనుక ఆమెకున్నూ మాసోదరులకూ గల సంబంధము త్వరలోనే ప్రకటిస్తాము. అంతవరకూ నీ వపనమ్మకముతోనే ఉండుము .. నీ యన్న తన నిర్ణయము మార్చుకొన్నాడని నీకు నమ్మ



కము లేదంటివి కదా? ఈజాబు చూడు. (ఇచ్చును)

చంద్రి—నాకు చేదోడువాదోడుగా మీ రుందురని యిందున్నది.

చకో—ఎప్పుడూ ఆలా గుండవలెననే నా కోరిక... సరే, ఎన్నిగడియల కక్కడ నీవుండవలెను?

వేణ—వేకువజామున నాలుగుగంటల కమ్మాయి నక్కడ చేర్చేపని నా కొప్పగించినారు శాస్త్రిగారు.

చకో—అది వారి కనుకూలమైన సమయము కాబోలు? (స్వ) అతని కెట్టి యాలోచన యున్నదో దీనివల్ల తెల్లమవుతూన్నది.

వేణ—మగవారి మాయలు వారికేకాని అమాయికలగు ఆడవాళ్ల కెట్లు తెలియగలవు?

చకో—సరే—మీరూ నేనూ నియమితకాలమున కక్కడికి పోదాము. వేణమ్మా—నాయందు నీకు నమ్మకమున్నదా?

వేణ—ఎంతమాట!

చకో—నీకు తగిన బహుమానము దొరుకుతుంది. నీ కళ్ళయెదుట ఆ పోకిరిని చావమోదుతాను. చంద్రికా! ఈమె నావెంట ఆ సమయమున రావడము నీకు సమ్మతమేనా? ఇప్పుడే చెప్పు.

చంద్రి—కళ్యాణి విషయమున వివరణకాకపూర్వము నేనే దురభిప్రాయమూ కలిగియుండను.

చకో—ఆమాటమీదనే యుండు-అన్ని సంశయములూ పటాపంచము కాగలవు...(పోవుదురు.)

---

రెండో రంగము—ఆనందరావింటిదరి.

హరిహరశాస్త్రి

హరి.—నాకు కావలసిన సుయోగము చిక్కనే లేదు. చివరకానందరావింటికి పోయి గుట్టు బయలుపెట్టక తీరదు. అతడు పిరికి, సన్నేమీ చేయలేడు-ఏదైనా మాట విన్నట్టయితే అదే ధోరణిగా నాలోచించి మననన్నుపికలు మొనరించుకొనును. బెల్లుతీసిన భూమిని నాటిన విత్తనము త్వరలో మొలుస్తుంది. నామాటయందు నమ్మకము కలిగి దానిని పరీక్షించవలెననే బుద్ధి పొడమితే చాలును, అటుపైని చింతలేదు. సరస్వతియంతఃపురమున మనోహరుడు ప్రవేశించక ముందే వారొకరినొకరు వలచినారు. పిమ్మట నింతకాల మేకాంతమున నిద్దరూ కలిసిమెలసి యున్నప్పుడు వలపీరికలెత్తి యుండదా? అదే నాకు ప్రబలమైన సాక్ష్యము. ఇందు తప్పక జయము కలుగును-కావున మనసు దృఢపరుచుకొని వారింటిలోకి పోయి నసకూ బెదరూ లేక చెప్పవలసినదంతా చెప్పితీరుతాను. నేనతని యాశ్రితుడను కాను కదా? నాకు జంకేల? (పోవును,)

(ఆనందరావు వచ్చును)

ఆనం—నాయింట కాలు పెట్టవద్దని చెప్పినానే, తిరిగి



యెందుకు వచ్చినావు?

హరి—మీరన్న మాట జ్ఞాపకములేక రాలేదు, మీ శ్రేయస్సు కోరినవాడనౌటచేత మీయింట జరుగుతూన్న ద్రోహకృత్యమును మీకు తెల్పవలెనని వచ్చినాను-ఆ రెండు మాటలూ చెప్పి వెంటనే పోతాను. ఇప్పుడు నాయందయిష్టము చేత మీకు గోలచేస్తే నలుగురూ వస్తారు, వారికీసంగతి తెలిసినట్టయితే మీ యింటిగుట్టు బట్టబయలయినందుకు మీరు పశ్చాత్తాపపడవలసి వచ్చును.

ఆనం—మీ డొంకతిరుగుడు ప్రసంగము నాకు బోధపడదు.

హరి—మీ ధనమును దొంగ హరిస్తూండగా మీరు కళ్ళుమూసుకొని యున్నారు, వాటిని తెరచవలెనని నేను వచ్చినాను.

ఆనం—ఏమిటీ మాట? నాయిల్లు సత్రమనుకొన్నావా? చలివేంద్రమనుకొన్నావా?

హరి.—ఒకరిమాట నమ్మే వివేకము లేనివారికి సలహాయిస్తే ఇదే చిక్కు.

ఆనం—మీ నిరర్థకపు మాటలలో నున్న గూఢార్థము పరిశోధిస్తూ కాలయాపనము చేయడానికి నాకు తీరిక లేదు-నాకు తెరపియున్నప్పుడు మీకు కబురంపుతాను, ప్రస్తుతము దయచెయ్యండి-మీరన్న రెండుమాట లయినవి-

హరి—కర్ర విరిచి పొయిలో పెట్టినట్లు చెప్పడము

నకు వీలైన అంశమయితే యిం తాలస్యము చేతునా?

ఆనం—నాధనము వీధిలో నేను పారవేయలేదు-నా యింట దొంగ చొరబడనేరడు-

హరి—కన్నము వేసే దొంగయితే కనిపెట్టబులే చెప్పి యుందురు.

ఆనం—మరెట్టి దొంగో త్వరగా చెప్పు.

హరి—మీరు ధనవంతులనీ ఎరుగుదును, ద్రవ్యము పోతే క్షణములో దాని నార్జించగలరనీ ఎరుగుదును. ధనము కన్న మానము హెచ్చుగా భావించేవారు గనుక దాని నిప్పుడేనా కాచుకొనండని చెప్పడానికిక్కడికి వచ్చినాను.

ఆనం—నా మానము నా యధీనము, దానిని హారించేవా డెవడు?

హరి—మీమానము మీయందే కాక ఇంకో వ్యక్తి యందున్నూ కలదన్నమాట మరచినారా?

ఆనం—నాభార్యను గూర్చి ఏమైనా చెప్పవలసిన దున్నదా?

హరి—ఇప్పుడు నాయుద్దేశము బోధపడినదా?

ఆనం—ఆమె చేసిన తప్పేమి? నాకు, తెలియలేదే?

హరి—పట్టపగలు చేసిన తప్పు మీదాకా వచ్చునేమోకాని చీకటితప్పు మీ కేలాగు తెలుస్తుంది? ఊరంతటా పొక్కినతరువాత కాని మీ కెరుకపడదు.

ఆనం—నీమాటలలో శ్లేష స్ఫురిస్తూన్నది. నీ పాం



డిత్యచాతుర్య మంతా వినియోగించినావు. ఒకరిపై నింద మోపడము సులభమే, తగిన నిదర్శనము చూపగల్గితే సరే కాని, లేకుంటే నిన్నీయూరిలో కాదు గదా ఈ లోకమం దుండనియ్యను.

హరి—వాక్చాతుర్యము మీ కున్నదని నాకు తెలిసిన విషయమే, కాని మీచర్య చూస్తే ముద్దుపెట్టుకోబోతే మూతి కరచినట్లున్నది-రాయి తన్నినేను చేయి నొవ్వనేల? నాదారిని నేను పోతాను-మీకంతా విశదమువునప్పుడు నామాట నిజమని తోస్తుంది-సరే నాకు సెలవు. (పోబోవును)

ఆనం—ఉండుండు-నీమాట నిజమైతే చెప్పవచ్చును.

హరి—అయ్యా, నిజ మాడితే నిష్ఠురము.

ఆనం—నిదర్శన ముంటే నిష్ఠురము కాదు.

హరి—నమ్మకము లేనప్పుడు నిదర్శన ముండీ ఏమి లాభము?

ఆనం—నిదర్శనము చూపితే నమ్మనివాడు మూర్ఖుడు.

హరి—పక్షపాతికి ప్రత్యయము కుదురుతుందా?

ఆనం—నిదర్శనము నిరవద్యమైతే పక్షపాతము పరిహార్య మగును.

హరి—ఇప్పుడు జంకులేక మనవిచేయ సాహసించగలను. కాని ఒక షరతున్నది.

ఆనం—అదేది?

హరి—మీకు నామీద మనస్సు విరిగినది, అందు

చేత అప్రియమైన వార్త నేను తెల్పినతోడనే మీ కపరిమితముగా కోపమువచ్చును. కోపపరవశులైనవారికి వివేక ముండదు, కావున నాయెడ మీకు గల వెగటు దూరముచేసి నా మాటలు సావధానముగా విని, వివరించి, కల్ల నిజముల నారసిన పిమ్మట దోషినని మీకు తోచినట్లయితే నన్నెట్లు శిక్షించినా వద్దనను... సావధానులయిన పిమ్మట నేను చెప్ప దలచినది చెప్పుతాను.

ఆనం—ఇంత పీఠిక యెందుకు? నీపై నాకు కోపము లేదు, కనుక నిస్సంకోచముగా చెప్పవచ్చును.

హరి—మీభార్యాశీలము మీరు పరీక్షిస్తూన్నారా?

ఆనం—అందక్రమ మేమైనా జరిగిందా?

హరి—జరిగినదనే వసంతి రహస్యముగా సారంతా పాకుతూన్నది.

ఆనం—ఆమెయం దట్టిలోప ముండునని నాకు నమ్మకము లేదు.

హరి—ఔను. మీ కట్లుండడము సహజమే.

ఆనం—మనోహరంపంతులుగారి బోధనకు పరిణామ మిదా?

హరి—అధ్యాపనమునకు అడిగిన గురుదక్షిణ యివ్వ వద్దా?

ఆనం—అతడే దురాచారమునకు పూనుకొన్నాడా?



హరి—ఔను కంచెయే చేను మేస్తూన్నది, మీరు నిద్రిస్తూన్నారు.

ఆనం—అత డింత ద్రోహము చేయునా?

హరి—అ ట్లెవ్వరూ నమ్మకపోవడమే అతని దుర్వర్తనమునకు ముఖ్యాధార మయింది. దానివల్ల అందరినీ మోసగించి యథేచ్ఛముగా రేపల్లెవాడలో గోపీసుందరుడువలె రాసక్రీడ సల్పుతూంటాడు. ఆశ్రమములోని అబలామణులు కాక మధ్యమధ్య పైని కూడా ప్రచారము సాగిస్తూన్నాడు.

ఆనం—సరే. అందుకు నిదర్శనము లేవీ?

హరి—సంతత సంసర్గము ముఖ్యనిదర్శనము. అధ్యాపనమిషతో నాతడొనర్చే ఏకాంత సంభాషణము రెండోది. అతని రూపు వయస్సు మూడోది, విధురత్వము నాల్గోది.

ఆనం—చివర రెండూ కొంతవరకూ ప్రబలమయిన కారణము లేమోకాని మొదటిరెండున్నూ నమ్మదగినవి కావు.

హరి—ఉత్తరోత్తరవృద్ధి న్యాయముననే నేను మనవి చేసినాను. ఆరెండూ యీ రెండింటితో కూడి అన్యోన్యాశ్రయము లైతే అవికూడా బలవత్తరములవునని ఒప్పుకొంటారా లేదా?

ఆనం—సరే. వాదమునకై అట్లే కావచ్చునంటాను.

హరి—మీవిషయమున బలవత్తమములైన హేతువు లున్నవి. వింటే వాటిని మీరు తోసివేయలేరు.

ఆనం—అవేవి?

హరి—వారిద్దరికీ విద్యావయోరూపసానుకూల్యముందని ఒప్పుకొంటారా?

ఆనం—నిజమే.

హరి—మీ దంపతుల కావిషయములందు ప్రాతికూల్యమున్నట్టే కదా?

ఆనం—ఊఁ.

హరి—మీభార్యయెడ మీ కత్యంతానురాగమున్నది కదా? ఆమె నెన్నడూ కోపించి యెరుగరు.

ఆనం—సందేహమేమి? పల్లెత్తుమాటనలేదు.

హరి—పైని చెప్పిన ఆనుకూల్య ప్రాతికూల్యములతో నీవిషయము మేళవించి ఆమెను స్వైరవిహారగా నొనర్చెను.

ఆనం—హేతువు బాగున్నది కాని సరస్వతియెడ నిది చెల్లుతుందా?

హరి—సరస్వతిని వదలి ఇంకో యువతియందిది చెల్లుతుందని ఒప్పుకొంటారా?

ఆనం—చెల్లవచ్చును.

హరి—పంతులుగారూ, మీ కామెయెడ గలవిశ్వాస మపోహమయినట్టయితే ఆమెయెడ కూడా ఇది నిజము కావచ్చునని మీరు సమ్ముతారా లేదా?

ఆనం—కాని నావిశ్వాస మపోహము కాదని నా అభిప్రాయము.



హరి—ఒకరి విషయములో సామాన్యధర్మము మీ యావిడయెడ వర్తించదనే వాదము కాష్టవాద మవుతుంది. ఆమె ఆడది కాదా, ముద్దుముచ్చట లామెకు లేవా, మంచి చెడ్డలుండవా, అహంకార ముండదా? మనోహరరావు సర్వ విషయములా సార్థకనాముడు, అట్టివాని చెలిమి పురుషులకే లోభనీయమైనప్పుడు పతియెడ నపరిమితమైన చనువుండి భీతిగొల్పు పెద్దలులేని స్వేచ్ఛావిహారిణియైనయువతి కది లోభనీయము కాదా? అతని వలలో నెంతమంది పడినారో మీ రెరుగుదురు కదా? అట్టి ప్రేమాఖేటనచణుడు, జగన్మోహనుడు, ప్రఖ్యాతశీలుడూ సంతతమూ ఎదుట నుండి సందేహములు తీరుస్తూంటే చపలచిత్తలయిన సారసముఖుల చిత్తములు మోహవశములు కావా?

ఆనం—సరే. మీ హేతువులు సమ్మతగినవే కాని ప్రత్యక్షనిదర్శనము చూపినట్టయితే మీ మాటయందు నాకు పూర్ణవిశ్వాసము కలుగుతుంది.

హరి—ప్రత్యక్షముగా నొక హేతువు చూపగలను కాని మీకది తెలిసినదో లేదో చెప్పలేను. ఆతనియందను రాగము పుట్టినప్పటినుండీ మీయందనురాగము హెచ్చుతూన్నట్లు ఆమె వర్తిస్తూన్నదా లేదా?

ఆనం—సరిపోయింది. నాయందనురాగము దినదినాభివృద్ధి పొందుతూంటే నాభార్య జారిణి యెట్లవుతుంది?

హరి—అదే చిత్రము. అదంతా నటన; మీ కే

యనుమానమూ కలుగకుండా ఆమె మీపైని జల్లిన మచ్చు మందు. అతివినయము ధూర్తలక్షణ మన్నట్లు అపూర్వానురాగము కులటాలక్షణము. ఆమె మీయెడ నిప్పుడు వర్తించే రీతి మునుపటి రీతికన్న భేదించినదో లేదో జాగ్రత్తగా పరిశీలించినారా?

ఆనం—మునుపటికన్న నాయందు వినయగౌరవములు హెచ్చినట్లున్నవి. అందుకు మనోహరావు హితబోధ కారణ మనుకొన్నాను.

హరి—చూచినారా? నామాట నిజమని మీకు తోచితే చాలును. మీ కళ్లలో దుమ్ముజల్లినదా?

ఆనం—సరే. మీ అనుమానము కేవలభ్రాంతి కాదని యిప్పుడు తోచింది.

హరి—మీకుగల సందేహలేశము ప్రత్యక్షప్రమాణముతో తీరిపోతుంది.

ఆనం—శీఘ్రముగా నట్టిది కన్పరిస్తే మీకు చాలా కృతజ్ఞుడను.

హరి—రేపాదివారము కదా? ఎప్పటిలాగె మనోహరంపంతులు చదువుచెప్పడానికి వచ్చును. మీ రదివర కెక్కడికో ప్రయాణమైనట్లు నటించి యింటిలో దాగుకోండి. నేను వచ్చి తక్కిన కార్యక్రమము చెప్పుతాను. ఇక నాకు సెలవు...(పోవును)

ఆనం—అయ్యో! దీని నెందుకు పెళ్లియాడినాను.



రూపమందు, వయస్సున, ధనమందూ దానికి నాకూ చాలా వైషమ్య మున్నది. నాకు తగిన వితంతువును పెళ్ళాడితే ఇంత కన్న నెక్కువ సుఖము చేకూరియుండును. పెనిమిటి దొరికితే చాలునని వారు రహోరాత్రములు గోలపెట్టుతూంటారు కనుక ఎంతో సంతోషముతో మెలగుతారు. అభిప్రాయములు, రుచులు, ఆదర్శములూ అనుకూలములుగా నున్నందున దాంపత్యసుఖము చేకూరియుండును, కాని సంఘసంస్కర్తలు నన్నుచూచి వెక్కిరించరా? ఇప్పుడుమాత్రము నాగతి ఏమైనది? ఉభయభ్రష్టుడ నైనాను. లోకమంతా నన్నుచూచి నవ్వలేదా? పైపెచ్చు జారిణితో సంబంధము దాపురించినందుకు నా చిత్త మెంత తల్లడిల్లుతూన్నది? ఇక నీజన్మమున నాకు సుఖము సున్న...మనోహరరావింత ద్రోహము చేస్తాడని నేను నమ్మలేకున్నాను. అంతి సద్వర్తనుడు వందలకొద్ది వితంతువులున్న ఆశ్రమమును సాగించవలసిన పవిత్రకార్య భారము శిరస్సుపై నుంచుకొని తన శీలమునకు మచ్చ తెచ్చుకొంటాడా?...తప్పు, తప్పు. ఆతడాలాటివాడు కానేరడు. ఈశాస్త్రి అతనిపై తనకుగల కసిచేత నిదంతా కల్పించినాడేమో?...కాని, ప్రత్యక్షముగా చూపుతానని చెప్పినాడు కదా! అదేమో పరిశీలించకుండా ఏదీ నిశ్చయించరాదు. తినబోతూ రుచి యడుగడ మెందుకు? (పోవును)

—

## —మూడో రంగము-దేవాలయము.

(చకోరుడు దాగియుండగా హరిహరశాస్త్రి ప్రవేశించును)

హరి—ఈ దేవాలయమున నాకొరకు వేచియుండు మని చెప్పినాను, కనుక ఈపాటికి వచ్చియుండును. (వేణమ్మ వచ్చును) ఏమి వేణూ, అంతా సిద్ధమా?

వేణ—మేమువచ్చి చాలాసే పయింది, మీరే ఆలస్యము చేసినారు; కొత్తపని యేదో కలిసి వచ్చింది కాబోలు, అది తెమల్చుకొని రావడ మాలస్య మయింది.

హరి—నీ కెప్పు డదే చింత. చంద్రికను కౌగిలిని చేర్చవలెనని కుతూహలము హెచ్చుతూన్నది.

వేణ—ఇక నే నెందు కిక్కడ? ఆమె బిడియపడు నేమో?

హరి—నేను చెప్పదలచిన దదే. (ఆమె వెళ్లును) ఇక్క డంతా అనుకూలముగా నుంది...దేవాలయ మనే సంకోచము నా కేమాత్రమూ లేదు, ఆమె బిడియపడు నేమో? బలవంతముగా పట్టుకొంటే ఏమి చేయగలదు?... ప్రేయసీ, చంద్రికా, ఇకనైనా నామాట వింటావా? అట్లు వింటివా నీజుట్టు కేమీ భంగ ముండదు. నీకు కళంకము తప్పదు కావున లోకమోహనము, సుందరము నీ కమిత ప్రియమైన జుట్టు నుంచుకొని శీలము కా కళంకము నంటించుకో- ఎవరున్నా దీనిని చూడబోరు కనుక నీ కే అపవాద



భయ ముండ నవసరము లేదు- నీ మనసు నామనసూ ఏకమైతే ఎప్పుడూ ఇది పరమగోప్యముగా నుంచవచ్చును. రాత్రులు ఘోరపాపములు చేసి పగలు పుణ్యాత్ములవలె నటించు వా ళ్లెందరు లేరు? అదీకాక ఒక్కసారి భగవద్గీతలో సుందరాకాండో పారాయణ చేస్తే సర్వపాపములూ సమసిపోవును కనుక ఇహమందుకానీ పరమందుకానీ నీ కేవిధమైన న్యూనతా లేకుండా చేసే పూచీ నాది...నీపై మోహమునకు తాళలేక మిష పెట్టి ఇక్కడికి రప్పించినానని కోపమా? ఇంటి వద్దనే నాపై దయతలచియుంటే ఇంత దూరము రానీయక పోవుదును...నన్ను క్షమించి యనుగ్రహించి నీకౌగిలి నిచ్చి ఇప్పుడైనా నాకు సుఖము కూర్చుము.

చకో—(స్వ) దుష్టా! ఎంత దురంతము చేయనున్నావు! నావలలో చిక్కితివి. నీ కుత్తమసుఖము చేకూర్చుతాను. కొంచె మోపిక పట్టు... (లేచును)

హరి—ఆహా! ఏమి నాభాగ్యము! నా మోహిని నాకు దక్కింది- (తొందరతో పోయి కౌగలించబోవును. చకోరుడు మోదును) అన్నా! వేణీ, ఎంత మోసము చేసినావే!

చకో—ద్రోహీ! ఒక అమాయికురాలి వేణి నపహరించదలచినావు గనుక వేణి నీకు తగిన శాస్తి చేసింది. పాపీ! ఎందరనాథలను పాడుచేసినావు! ఆపాపము నిన్నూరకే విడుచు ననుకొన్నావురా? (ఇద్దరూ పెనగులాడుదురు, శాస్త్రిలు పారిపోబోవును)

వేణ—నిన్న నేను మోసము చేసినానా? నాకొంప నీవు తీయలేదా? ఏమీ యెఱుగని సన్నిలాగే మోసగించి మన పాపమునకు సాక్షీభూతు డైనని పసిబాలుని నీకడుపున పెట్టుకొన్నావు? పీనుగా! నీకు చావు తగ్గదాయెగా దైవమా అనే నా మొరను భగవంతు డీనాటికి విన్నాడు-కొంత చిత్త శాంతి యైనది- నీవు చచ్చినవార్త వింటే నాకడుపునకు పూర్తిగా శాంతి చెందుతుంది- చావు ముండకొడకా! నీవంటి చండాలుడు చస్తే భూభారము చాలా తగ్గుతుంది.

చకో—వేణమ్మా! ఇప్పటికి శిక్ష చాలును- ఇంటికి పోదాము పద.

---

—నాల్గో రంగము— అనాథాశ్రమము.

కళ్యాణి

కళ్యా—కళ్యాణికీవ్యాధికడపటిదే. ఇక కొన్నిగడియలలో నామె మృతినొంది, ఇదివరకుమృతినొందిన తరంగిణి తిరిగి బ్రతుకును. నాప్రియుడు కళ్యాణినిచూచి మోహించెను కదా? ఇదే నాకు విచారహేతువు; మగవారు చంచలులని ఎంచవలసియున్నది. కాని కళ్యాణీ నాతడు మోహించినందున చంద్రికాచకోరకులకు వివాహాము ఘటిల్లుతుందని సంతసము కలుగుతూన్నది. ఒకరు సుఖించవలెనంటే ఇంకొకరు దుఃఖించవలెననే విషయ మనుభవసిద్ధము. అదిగో ఎవరో వస్తూన్నారు, రోగివలెనే పరుండవలెను.(విహారుడు వచ్చును)



విహా—(స్వ)చకోరు డీవార్త చెప్పినప్పటినుంచీ నాకేమీతోచలేదు- కళ్యాణిరోగగ్రస్తురాలయిందని వినగానే బొత్తిగా నాకు మతిపోయింది నాకామెతో పరిచయ మత్యల్పమైనా స్నేహ మత్యంత సాంద్రమాయెను. నా ప్రాణములన్నీ ఆమెపై నాధారపడియున్నవి. ఏకోద్యోగులమయి నందున మైత్రి కలిసినది. నాప్రేయసితో నీమెకున్న రూపసాదృశ్యమే ఇందుకు హేతువు కావచ్చును-పరమేశ్వరా!మా పరస్పరానురాగము చిరస్థాయిగా నుండునట్లు ప్రసాదించుము. (పైకి) ఏమి కళ్యాణీదేవీ, జ్వర మేలా గున్నది?

కళ్యా—మీరు దయచేసిన పిమ్మట కొంత నెమ్మదిగా నుంది.

విహా—(స్వ) ఈమెకు నాయం దెంతప్రేమ ఉన్నది! మనోహరునివద్ద ప్రతిజ్ఞ చేయకుండినట్లయితే— శివశివ! విహారా! ఈస్త్రైణము నీ కేలాగు కల్గెను? తరంగిణీ పూరితమైన నీహృదయమం దితరకాంతను ప్రవేశపెట్టుతున్నావా? ఛీ ఛీ! మూఢము! గుణవంతుడు దుశ్చింతనల చేయడు- ఈమెయెడ గల మోహము నిర్మూలము చేయవలెను...ఆ. జయించినాను. ఒక్కసారి ఈమెతో నిష్కపటభావమున ప్రసంగించిన పిమ్మట మరి ఈమె మొగము చూడను...(పైకి) నీజ్వరము తగ్గినదా?

కళ్యా—ఏమో నాకు తెలియదు; నీరసముమాత్రము హెచ్చుగా నున్నది.

విహా—నాకు కొంచెము నాడిపరీక్ష తెలుసును, చేయి చూడవచ్చునా?

కళ్యా—పతివియోగము ప్రాప్తించి నప్పటినుండీ నాచేతిని పురుషు లంటలేదు. ఐనా మీయందున్న గౌరవముచేతను ప్రేమచేతనూ మీయెడ నెట్టి యాటంకమూ ఉండరాదు. (చేతినిచ్చును)

విహా—నీకు నాయెడ గల విశ్వాసమునకు కృతజ్ఞుడను. అదేమో కాని నిన్ను చూచినప్పటినుండీ మాబంధు కోటిలో దానవనే భావము పుట్టినది. మన కేదో పూర్వజన్మానురాగ ముండి యుండవలెను. (నాడిచూచి) చేతిలో జ్వరము లేదు. కొంచెము వేడి మాత్ర మున్నది. నోరు చేదుగా నున్నదా?

కళ్యా—లేదు, నోరెండిన ట్లున్నది.

విహా—ఏదీ నాలుక చూపించు.

కళ్యా—(స్వ) "కొన్నది వంకాయ, కొసరినది కొబ్బరికాయ"...(పైకి) అయ్యా, నాకు పునర్వివాహ మగువరకూ నామొగము పురుషులకు చూపనని శపథము చేసినాను, కావున మేలిముసుగు తీయజాలను.

విహా—చిత్రముగా నున్నదే ప్రతిజ్ఞ. శరీరమంతా కనబర్చునప్పుడు మొగమును మాత్రము దాచిన నేమి ప్రయోజనము? పురుషులకంట బడనని ప్రతిన బట్టియుండిన మేలుగానుండును.



కళ్యా—సుమంగళిగా నున్నన్నాళ్లట్లే యున్నాను. భర్తృవియోగము ప్రాప్తించి పునర్వివాహేచ్ఛ పొడమి నప్పుడు పురుషులతో ప్రసంగించవలసియుండును, కనుక ఆ నీమమున కొంతభాగము తగ్గించినాను.

విహా—మొగము చూపినంతనే మోహముద్భవించునని నీయూహ, దీని బట్టి పురుషజాతియందు నీకు గౌరవము లేదని తేలినది.

కళ్యా—సందేహ మేమి? ప్రకృతే దీనికి నిదర్శనము. నిశానారి విమలమైనది, నిశ్చలవ్రతానుసారిణి, నిశానాథుడు చంచలుడు. నది తటానువర్తినియై నియమితమార్గానువర్తినియై పతిని చేరును, సముద్రు డతిచంచలుడు.

విహా—ఉపమానములా ప్రమాణము! వెఱ్ఱిదానా, నీవు చెప్పిన ప్రకృతినుండే స్త్రీలు చంచలురని నిదర్శనములు చూపనా? ఆకాశమున మేఘపుంజము సాంద్రమై స్థిరభావము నొంద మెరుపు చంచల కాదా? తరువు స్థిరమైయుండగా దాని నాశ్రయించిన లత పిల్లగాలి వీచినా తన చంచలస్వభావము ప్రకటింపదా? ధృవుడు స్థిరుడై యుండ తారక లెప్పుడూ చలిస్తూండును కదా? ఇట్టి కుయుక్తుల కేమి?—ఒకమాట చెప్ప మరచినాను, నా కీయవస్థ ప్రాప్తించి నప్పటినుండి నేనింకొకర్తెను వివాహమాడనని శపథము చేసినాను. కావున నాకు మోము జూపితే మోసముండదు; చూపకుంటే ప్రమాదము సంభవించునేమో?

కళ్యా—ఎట్లు?

విహా—రోగము ముదిరితే గోళ్ళతో తీయవలసిన దానికి గొడ్డలి కావలసివచ్చును.

కళ్యా—నా రోగము ముదిరితే ప్రపంచమున కేమి లోటు? నిరర్థకమైన ఒకజీవి యూడ్చితే లోకానికి నష్టము లేదు-ఈపాటిదానికి మాట పొల్లుచేయడ మెందుకు?

విహా—నీమాట పొల్లుచేయకు. అద్ధర్మము క్రింద నేనే నామాట వదలుకొంటాను. సంఘసే, పరోపకారము, ఇవి నాకు పరమావధులు-వాటిని నిర్వర్తించవలసివచ్చినప్పుడు నేనన్య మేదీ లెక్క చేయను.

కళ్యా—ఇదివర కేమో అనుకొన్నాను. కాని మీకు మాట నిలకడ లేదని యిప్పుడు తెలిసింది. మీమాటనమ్మడ మేలాగు?

విహా—నిన్ను సుఖపెట్టవలెననే ముఖ్యోద్దేశము ప్రశంసనీయము కాదా?

కళ్యా—మాట తప్పడము మంచిది కాదు. అట్టి వారిని నమ్మడము ప్రమాదము.

విహా—ఆలా గనుకో వద్దు. ఉత్తమాదర్శము కర గతమైనప్పుడు అధమాదర్శమును నిరసించడము తప్పుకాదు-

కళ్యా—స్వార్థము కలిసివస్తే ఆదర్శ ముత్తమ మవుం దురు కాబోలు?



విహా—నీకొరకు ప్రాణములైనా విడువవలెనని నేను భావించడము స్వార్థమందువా?

కళ్యా—నాయం దట్టిభావము పుట్టినందుకు సంతసింతును కాని స్వసుఖాభిలాషచేత నది ప్రభవించినదో లేదో, ఇంకో సందర్భమున ఇట్టి నిశ్చయము మారునేమో అని సందేహిస్తున్నాను. పూర్వాచార పరాయణులైన మీకు స్త్రీ పునర్వివాహము నేడు నచ్చినదన్న మాట నమ్మవచ్చునా?

విహా—భార్యావియోగ మైనపిదప నా స్వభావము మారింది- విధుర వివాహము స్త్రీపునర్వివాహమూ రెండూ అన్యోన్యాశ్రమములు, శాస్త్రీయములు, ఆవశ్యకములు- చేస్తే రెండూ చేయవలెను, మానితే రెండుమానవలెను. ఒకటి చేస్తే రెండూచేయవలెననే సిద్ధాంతము న్యాయము. విధురుడు వితంతువునే తప్పకుండా పెళ్ళిచేసుకోవలెను.

కళ్యా—మీ సోదరి వివాహమాడుతుందని తెలిసి మీ రామెను కట్టడిలో నుంచినారట, ఆమె బాల్యమిత్రుడామెను చూడకుండునట్లేర్పాటుచేసి, తుద కాతడు తెగించి రాగా అతని నవమానపరచినారట?

విహా—అవి మునుపటి మాటలు... భ్రాంతివోదితములు.

కళ్యా—ఇప్పటి యభిప్రాయమూ మరికొన్ని దినములలో మారునేమో?

విహా—అసంభవము. మునుపు పూర్వాచారపరా

యాణుల వాదమే సత్యమనే మూఢవిశ్వాస ముండెను. వారేది చెప్పినా శిలాక్షరమని నమ్ముతూంటిని- ఇప్పు డీ యాశ్రమము చేరి యిచ్చటి గ్రంథములు చదివి వితంతువుల జీవిత మేలాగు పవిత్రము, సుఖావహము ప్రయోజకమూ కాగలదో కన్నులారా చూచినందున పూర్వపు భ్రాంతి యను అంధకారము నశించి ప్రమయను కాంతి తోచింది. ఇది పోయేది కాదు- సత్యమునకు పరివర్తన ముండదు.

కళా—ఆలాగైన ఆమె వివాహ మచిరకాలమున చేసెదరా?

విహా—ఆమె నడిగిగాని ఏదీ నిశ్చయించను- ఆమెకు వివాహ మిష్టమయి, తగినవరు నామె యెంచుకొన్న తరువాత అతడు నాకు నచ్చితే నే నవశ్యముగా పెళ్ళి చేయించి తీరుతాను.

కళ్యా—మీ మాట?

విహా—నా కిష్టమైన కాంత దొరికి ఆమె నన్ను పెళ్ళియాడ సమ్మతిస్తే నేనూ ఒప్పుకొంటాను.

కళ్యా—ఆలాగైతే మనోహరరావుగారితో ప్రసంగించి ఏదో నిర్ధారణ చెయ్యండి- ఆలస్య మెందుకు?

విహా—అతని కిప్పుడు తెలిపితే ప్రయోజనము లేదు. ఆడవారి నొప్పించడానికి మగవారు పనికిరారు.

కళ్యా—పోనీ- నే నీ పనికి పూనుకొందునా?



విహా—అంతా నీలో నున్నది: నీ వొప్పుకొంటే నా అభ్యంతరము లేదు.

కళ్యా—సరే-మీ భోగట్టా కొంత నాకు కావలెను.

విహా—కొంత ఏమి? అంతా చెప్పుతాను.

కళ్యా—మీ మొదటిభార్య అకాలమృత్యువుకి కారణమేమి?

విహా—మొదటి తప్పు నాది, రెండోది దానిది.

కళ్యా—వివరించి చెప్పండి.

విహా—అప్పుడు హరిహరశాస్త్రి అనే మాయకానికి నా చిత్తస్థైర్యము జూపవలెననే బడాయిచేత చకోరునిపై పల్లేరుమీద బండిలాగు నీల్గినాను. నాభార్యా చకోరుని పక్షము వహించగా ఆమెతో కూడా కొన్ని బీరములు పల్కి యింటినుండి పొమ్మన్నాను. దీని కాతనిదుర్బోధన హేతువు కాని నిజముగా నాభార్యపై నాకు కోపమే లేదు-ఇది దానికి తెలియకపోవడముచేత హఠముపూని ఇల్లు వెడలింది-శీఘ్రమే వస్తుం దనుకొని ఎంతోసేపు చూచినాను, రాలేదు; మరి కొంతసేపటికి ఆత్మహత్య చేసుకొన్నదని జాబువచ్చింది-పోనీ శవమునైనా చూస్తే మనస్సు కొంత శాంతిస్తుందని ఎంచినాను, కాని అదీ నిష్ఫలమని చకోరుడు చెప్పగా నిరాశాహతుడ నైనాను.

కళ్యా—ఆమె ఏమి తప్పు చేసింది?

విహా—నేను కోపదారి నని ఎరిగీ నన్ను క్షమించ కుండా అత్యాతురమున ఆత్మహత్య చేసుకొన్నది-ఇది అవివేకము.

కళ్యా—ఆలాగు చేసింద ని మీ కామెయెడ కోపమా?

విహా—శ్రీరామ, రామా, దానిపై నా కెప్పుడూ కోపము లేదు. ఆ దుర్మార్గునిమాట విని గొప్పకోసము పాకులాడి దాని నవమానించినాను.అదే నాపై కోపగించ వలసినది. దోషిని నేను, పాపాత్ముడను నేను, ద్రోహిని నేను-అది ఉత్తమమైన ఇల్లాలు-కోప మన్న దెరుగదు-గుణవంతురాలు-అట్టి దీ జన్మమున నాకు చేకూరడము నా పూర్వభవ పుణ్యఫలము.

కళ్యా—అయ్యో! మీమాటలు వింటే నాగుండె నీరయింది. ఇట్టి దాంపత్యము సర్వాపేక్షణీయము. స్త్రీలకు వివేకము లేదు-రవ్వంతమాటకు ప్రాణములు విడవలెనా? మూర్ఖురాలు!.

విహా—ఆ మాటలు దాని ననవలసినవి కావు. నాకు వివేకము శూన్యమయింది, నేనే మూర్ఖుడను. అది తెలివైనదే.

కళ్యా—ఆమె రూపసియేనా?

విహా—కోపపడకుంటే ఒకమాట చెప్పుతాను నీకూ దానికీ చాలా విషయములయందు పోలికయున్నది.

కళ్యా—ఆలాగైతే నాపని సులువే-ఈ యాశ్రమము



లో నాకన్న సుందరులు చాలామంది ఉన్నారు-మీరు వారందరినీ చూచి ఎవర్తె మీకు నచ్చినదో చెప్పండి, నా శక్తివంచన లేకుండా ఆమె మిమ్ము పెళ్ళియాడునట్లు చేసెదను. ఎంత ప్రయాసమైనా వెనుదీయను.నాచేత కాకుంటే మరికొందరిచేత చెప్పించుతాను.

విహా—నీకు నాపై నంత అనురాగ ముంటే ఒకరు చెప్పనక్కరలేదు.

కళ్యా—నేను చెప్పినంతనే ఒప్పుకొనే పిల్ల దొరికితే కావలసిన దేమి? మీ కెవర్తె నచ్చినదో నాతో చెప్పండి.

విహా—నాకు నచ్చితే సరికాదు, ఆమెకు నేను నచ్చవద్దా?

కళ్యా—మీరు నచ్చకేమి? ధనమా తగినంత ఉన్నది కదా?

విహా—నాకన్న ధనవంతులు లేరా?

కళ్యా—వారు పునర్వివాహము చేసుకొందురా? అట్లు ఎవరూ బయలుపడలేదే?—రెండోది, విద్య, వివేకము నున్నవి—మూడోది, లోగడ దాంపత్య మనుకూలముగా నుండి-ఇంతకన్న యింకేమి కావలెను?

విహా—ఇవి నీకు నచ్చినవా?

కళ్యా—నచ్చకుంటే మీపక్షమున పని చేస్తానా?

విహా—ఒక్కమాట అడుగుతాను, దానికి సరియైన ఉత్తర మిచ్చెదవా?

కళ్యా—నిరభ్యంతరముగా నడుగవచ్చును-వింతదానననీ భావించకండి.

విహా—నీవు పునర్వివాహము చేసుకొందు వట నిజమేనా?

కళ్యా—అడిగినారు గనుక అరమర లేకుండా చెప్పుతున్నాను. ఉద్దేశ ముందికాని ఇంకా నిర్ధారణ కాలేదు.

విహా—ఎందుచేతనో అడుగవచ్చునా?

కళ్యా—నే నీయూరికి క్రొత్తదానను-నాసంగతి యితరులకు తెలియదు, ఇతరుల సంగతి నాకు తెలియదు-అందుచేత కొంతకాల మాగి నిర్ధారణ చేసుకోవలెను. ఇదికాక యింకో కారణ ముంది-నాసోదరునికి ప్రథమవివాహమే కాలేదు. అది జరిగితేనేకాని నేను రెండోపెళ్లి చేసుకోను.

విహా—ఎవ డాసోదరుడు? ఎక్క డున్నాడు? నేను ఎంత సొమ్మైనా ఖర్చుపెట్టి వానికి పెళ్ళి చేస్తాను.

కళ్యా—దాని కేమి తొందర?

విహా—మరేమీ లేదు-తరువాత నీవు పెళ్ళియాడ వచ్చునని.

కళ్యా—దాని కంతకన్న తొందర లేదు.

విహా—వెర్రిదానా, నా రెండో పెళ్ళికేనా తొందర? నీ తమ్మునికి తగిన పిల్ల దొరికినదా?

కళ్యా—దొరికింది, వధూవరులు సమ్మతించినారు కాని ఆమెబంధువు లొప్పుకో లేదు. వారి సమ్మతి లేక



పోతే ఆమె వివాహము చేసుకోదట.

విహా—వితంతువా? లేక అవివాహితా?

కళ్యా—మొదటిదే.

విహా—మన ఆశ్రమమునకు వస్తుందా?

కళ్యా—దానికే బంధువులు ఆటంకమే-వారు పూర్వాచారపరాయణులు.

విహా—వా రెవరో చెప్పు-క్షణములో వాదించి ప్రమాణములు చూపి సంఘసంస్కర్తలనుగా మార్చివేస్తాను.

కళ్యా—అదే ప్రయత్నము చేస్తూన్నాము. సఫలమవుతుందనే ఆశ కొంచెము కలుగుతూన్నది.

విహా—సరే, నేను వెళ్ళి పూర్ణ ఫలము కలిగేటట్లు చేస్తాను-పూర్వాచారులకు పూర్వాచారులే బోధించగలరు.

కళ్యా—మీరు పట్టుబట్టితే కార్యము సఫలమవుతుందనే నమ్మకము నా కుంది.

విహా—అయితే యీక్షణమే వెళ్ళి సానుకూలము చేస్తాను.

కళ్యా—అలాగే చేయవచ్చును-నేనూ మీరూ ఏక కార్యావలంబకుల మవుదాము. మీకు నచ్చిన పెళ్ళికూతురు పేరు నాకు చెప్పండి, నాతమ్మునికి నచ్చిన పెళ్ళికూతురు పేరు నేను చెప్పుతాను.

విహా—ముందు నీవు చెప్పు.

కళ్యా—ఆలాగు కాదు, పెద్దలు మీరు ముందు సెల వివ్వవలెను.

విహా—చిన్నవాళ్ళకు ముందు పెళ్ళి చేస్తేనే కాని నామాట తలబెట్టను.

కళ్యా—పెద్దలు ముందుసుఖింపవలెను-ఆవెనుక చిన్నలు పరులు ముందు సంతసించవలెను, ఆవెనుక స్వజనము-ఇది న్యాయము.

విహా—అన్నా, గట్టిచిక్కే తెచ్చిపెట్టినావు.

కళ్యా—నాతో చెప్పడము మీ కిష్టము లేదా?

విహా—అదికాదు.

కళ్యా—మరెందుకూ సంకోచము? నాపైని నమ్మకము లేదా?

విహా—నిష్ఠురము లాడకు నీకు కోపము వచ్చునేమో అని జంకు.

కళ్యా—నాకు కోప మెందుకు? నాయందు విశ్వాసముంటే సరి; మీవిషయమై నాకూ జంకే.

విహా—నావిషయమున నీ కేమి జంకు?

కళ్యా—మీమొదటి భార్య దైవకృపచేత బ్రతికి వస్తే ఇప్పుడు మీరు చేసుకొనేదాని గతి ఏమి కాను?

విహా—అట్టి సందేహము వద్దు-ఆమె బ్రతికియుంటే ఇన్నాళ్లు నన్ను విడిచియుండదు. అదీకాక దహనసంస్కారమయిందని తెలిసింది. మనోహరుడబద్ధమాడడు.



కళ్యా—కోపమువచ్చి ఆమె అట్లు వ్రాసిందేమో?

విహా—అంతటియదృష్టము నాకు పట్టితే యిద్దరినీ ఏలుకొంటాను, కాని వితంతువునకు విశ్వాసఘాత చేయను.

కళ్యా—మంచిమాటన్నారు.

విహా—జంకు తీరింది కనుక ఇప్పుడు చెప్పు నీ మరదలు పేరు.

కళ్యా—నా జంకు తీరింది, మీ జంకు తీరనీ.

విహా—నేనేమన్నా నీకు కోపము రాదన్నమాటేనా? అందువల్ల మీతమ్ముని వివాహమాగిపోతుందేమో?

కళ్యా—ఆలాగయితే యిద్దర మొకమాటే చెప్పుదాము.

విహా—ఏదీ వినబడకుండానా? కాగితముల మీద వధూవరులపేర్లు ఒక్కసారే వ్రాతాము.

కళ్యా—మంచి ఉపాయమే. (వ్రాసి ఒకరి కాగితమొకరు చూచుకొందురు. కళ్యాణి మొగమువంచుకొని ఊరకుండును.)

విహా—(కళ్యాణిని చూచి నవ్వుతూ) నీ మాట నేను కాదందునా? నీ వేమంటావు?

కళ్యా—(నిలువబడును.)

విహా—ఊరకుంటే ఒప్పుకొన్నట్లే- నాపుణ్యము పండినది. నీకూ నీతమ్మునికీ ఒక్కసారే పెళ్ళి చేతాము-

కళ్యా—మీకూ మీచెల్లెలికీ అనగూడదా?

విహా—అది నీ వనవలసిన మాట.

కళ్యా—ఇంకోటుంది, దైవవశమున మీభార్య మీకు లభిస్తే నన్ను మరతురేమో సుమండీ. అట్లయితే కళ్యాణి హత్యచేసుకొనడానికి మీరు సమ్మతించవలెను.

విహా—నిన్ను నే నెన్నటికీ మరువను, మరువలేను- మన ప్రాణము లొక్కసారే పోవుగాక!

కళ్యా—మీరిద్దరూ సుఖముగానుంటే నాకుచాలును. **అదే** నా కుత్తమలక్ష్యము; అది చేకూరితే నాకు నిరతిశయానందము చేకూరినట్లే.

విహా—గగనారవిందమువలె నిరాశ్రయమయిన భావకల్పన చేసి గాలితో మేడ కట్టుతున్నావు. తరంగిణి జీవించి యుండడము అసంభవము.

కళ్యా—ఏమో దైవేచ్ఛ యెట్లున్నదో ఎవ రెరుగుదురు?

విహా—విరసమైన యీ సంవాదముకు స్వస్తిచెప్పి మొగము చూపవా?

కళ్యా—ఇప్పుడు చూస్తే మీకు నాపై వెగటుపుట్టుతుంది. యథాకాలమున చూపించకతీరదు. అంతవరకేనా మీచిత్తమునకు శాంతి యుండనీయండి.

విహా—ఈప్రశంస మానవా? మేలిముసుగు తొలగించడానికి నీకు సిగ్గయితే నేను తొలగింతునా?



కళ్యా—ఇది మాలో పూర్వాచారవిరుద్ధము. ఆడవారే దానిని తొలగించవలెను.

విహా—మనము సంఘసంస్కర్తలము, పూర్వాచారముతో మనకు పనిలేదు.

కళ్యా—సరిసరి అన్నివిషయములా అపూర్వాచారముల నవలంబిస్తారా మీరు?

విహా—ఈవిషయమున తరంగిణినే పోలినావు- అదీ యిల్లే మాటమాటకీ తప్పించుతూ ఉండేది.

కళ్యా—పరిచయము హెచ్చినకొద్దీ యింకా సాదృశ్యములు కనబడుతవి.

విహా—మరీమేలే- మేలిముసుగు తీయవా?

కళ్యా—మీపట్టు విడువరా?

విహా—నీ కిష్టము లేకుంటే బలవంతము చేయను.

కళ్యా—మీ కిష్టమైనపని చేయక నాకు తీరునా?

విహా—అలాగైతే తీసివేయుము-

(చకోరుడు వచ్చును)

చకో—ఆనందరావుపంతులుగారు మొన్న నిచ్చిన విరాళమునకు వారి నభినందించడమునకు మనల నందరినీ తక్షణమే రమ్మని అన్నగా రాజ్ఞాపించినారు. బైట బండి సిద్ధముగా నున్నది.

కళ్యా—అవశ్యము పోదాము.

తరం—మీరు విన్నబోవద్దు- నా చరితమంతా విని పిస్తాను, లోపలికి రండి-

———

—ఐదో రంగము-ఆనందరావిల్లు.

ఆనందరావు, హరిహరశాస్త్రి.

విహా—ఇక్కడ మీరు నిలుచుంటే వాళ్ళమాటలు స్పష్టముగా వినబడుతవి. నే నక్కడ కూర్చుంటాను.

(మనోహరుడు, సరస్వతి)

సర—ఇంతవరకూ మీ రేవో కల్లబొల్లిమాట లాడి నాకళ్ళు తుడిచినారు, కాని నేడు నన్ను వంచించలేరు. నా కోరిక తీర్చక వీలులేదు.

హరి—విన్నారా? ఆమెకోరిక తీర్చవలెనట-

ఆనం—(తల యూచును)

మనో—వెఱ్ఱి కుదిరింది, రోకలి తలకు చుట్టుమన్న ట్లుంది నీ చిత్తవృత్తి. నే నిన్నాళ్ళనుండీ బోధనచేసినదాని కిదా ఫలము? ఆనందరావుగారు సంతసించి యాశ్రమమునకు ద్రవ్యసహాయము చేసినారు. దానికి నేను చేయవలసిన ప్రతిక్రియ మిత్రద్రోహమా?

సర—మీ రాశ్రమముగురించి పనిచేయుడములో మీకు కావలసిన సాయము నేను చేస్తాను. నన్ను మీదాసిగా నను(గ్రహించండి.



మనో—నేను రోగపీడితుడ నైనప్పుడు నాకు తల్లి వలె పథ్యపానములు సల్పి నే డిట్టి యసందర్భపుకోరిక కోర గూడునా?

ఆనం—భళీ, మనోహరా, భళి.

సర—అన్నమాట తప్పనివా రేనా మీరు?

మనో—నే నేమన్నాను? ఎట్లు మాట తప్పినాను?

సర—మీరు నన్ను వివాహము చేసుకొందు నన లేదా?

మనో—అసలు పెళ్లి చేసుకుంటే గదా? నేను పెళ్ళాడనని ప్రతిన బట్టినాను.

ఆనం—అన్ని సంశయములూ భగ్నమైనవి- ఏమంటారు శాస్త్రిగారూ?

సర—ప్రతిన కేమి? మీరు దానికి విరుద్ధముగా నడుస్తూన్నారు-

మనో—శ్రీరామరామ! ఎవ రన్నారు?

సర—లోకమంతా ఎరుగును- కళ్యాణియందలి మోహాంధకారము మీకళ్ళుకప్పింది కాని అందరికీ తెలుసును-

మనో—ఇది కేవల మపోహము- దీనికి నిదర్శనము లేదు- కళ్యాణి నాకు సోదరి.

సర—నోటిమాట నేనా నమ్మను- నిదర్శనము మీరు చూపగలరా?

మనో—తప్పకుండా చూపించగలను.

సర—మీరు చూపించలేరు?

మనో—చూపించితే?

సర—మీమీద నాకున్న మోజుతో నాపతియెడ వర్తిస్తా త్రికరణశుద్ధిగా పరపురుషులెల్ల సోదరులని భావిస్తాను.

ఆనం—హాయి! హాయి! నాచెవుల కమృతసోనలవలె ఉన్న వీమాటలు.

మనో—నిజమేనా?

సర—దైవము తోడు, నాపతి తోడు, మీ తోడు.

మనో—కొద్ది దినములలో నిదర్శనములు చూపించి నీచేతనే నేను కళ్యాణియెడ సోదరునిగా వర్తిస్తున్నా నని పించగలను.

సర—ఈకళ్ళ కీరెప్పలు దూరము కావుగదా? అలాగే కానీండి. (ఆనందరావు హరిహరశాస్త్రీ వత్తురు)

ఆనం—మనోహరరావుగారూ, మీరు చేసినమేలు మరువజాలను...సరస్వతీ, నీవు లజ్జపడ నక్కరలేదు. నీచిత్తవృత్తి స్త్రీస్వభావమున కనురూపముగా నున్నది-నీవు పూర్వజన్మమున చేసిన పాపముచేత నాకు భార్యవైనావు, నిన్ను దుఃఖపెట్టడమునకు నా తెలివిలేమియే కారణము-కాని నేను చేసుకొన్న పుణ్యముచేత నీవు నాకు లభించడమే కాక, మనోహరరావుగారు విద్యాదాన మనే పరశువేదిచేత నాయెడ ప్రతికూలముగానున్న నీచిత్తము ననుకూలముగా చేసినారు. ఆతని ధర్మమున మన సంసారము నిలిచింది-



ఆతని కంటినమచ్చ నాతడు తుడిచివేసిన వెంటనే నిన్ను నేను పత్నిగా గ్రహిస్తాను.

మనో—ఓహో శాస్త్రీగారా? ఏ రెందుకు వచ్చినారు?

ఆనం—ఈ నీచుడు మీ రొకరినొకరు వలచి వివాహము చేసుకొన నిశ్చయించినారని నాకు దుర్బోధనచేసి మిమ్మిద్దరినీ పట్టి యిస్తానని నన్నిక్కడికి తీసుకొని వచ్చినాడు.

మనో—నా చిత్తవృత్తిని స్వయముగా పరిశీలించినవారు నాకు పరమోపకారులు-నిజము నిదర్శనమువల్ల నిశ్చితమవును కదా?

ఆనం—మేలిమిబంగారమున కగ్నిభీతి యుండునా? నిప్పును చెద లంటునా?

హరి—ఆనందరావుగారూ, మీభార్య మనోహరుని వివాహము చేసుకొన నిశ్చయించినదని నేను చెప్పినది నిజమయినదా లేదా?

సర—ఛీ తుంటరీ-నామనసు చెడగొట్టినది నీ బోధన, బాగుచేసినది వారి బోధన...ఈ యుత్తరములు చూడండి, వీనిచర్య మీకు తెలుస్తుంది-(ఇచ్చును)

(చకోరుడు వచ్చును)

ఆనం—ఓరి చండాలుడా! మిత్రునివలె నటించి ఎంత ద్రోహము కొడిగట్టినావురా?

చకో—ఇంతే కాదు, వీని దుశ్చరిత మింకొక టున్నది-సరస్వతి తనమాట వినలేదన్న కసిచేతనే మీతో నామెపై పోటీలు చెప్పి, పిమ్మట చంద్రికను చెరపజూచి విఫలుడై ఆమెకు కేశఖండనశిక్ష విధింపదలచి రాత్రి మూడోజామున ఆమెను సముద్రపుదరికి తీసుకొనిపోయి బలాత్కారింప జూచినాడు. (వేణమ్మ వచ్చును) ఈయిల్లాలి నీతడు పెట్టిన బాధ ఏమని చెప్పను?

వేణ—అయ్యలారా! నే నెంతోకాలము జీవింపను, కాని నా శీలము చెరచి నన్ను శాశ్వతమూ నరకకూపమున బడునట్లు చేసిన పాపి వీడే. అసదను అనాథనైన నన్ను వీడు పెట్టిన రవ్వకు తగిన శిక్ష చేయించినాను-మీరే చూస్తూండండి—

పోలీసుఇనస్పెక్టరు జవానులు వత్తురు.

చకో—అయ్యా-ఇదుగో శిశుఘాతకుడు. వీడే ఆ యర్భకుని అనాథశరణాలయమునకు కొనిపోదునని తల్లిని నమ్మించి పసిబాలుని గొంతుక నొక్కి పారవేసినాడు.

హరి—సర్వాబద్ధము, నాయందలి మాత్సర్యముచేత నితడీకథ కల్పించినాడు.

వేణ—ఇదంతా నిజము-ఆదినుండీ నాకొంప తీసినది వీడే.

ఇన—అయ్యా, వాదముతో పనిలేదు. మీమాటకు వ్యతిరేకముగా ప్రమాణములు సమృద్ధిగా నున్నవి.



హరి—నేను మీకు లోబడేవాడను కాను. (డబ్బీ లోపలినుంచి మాత్రిలు తీసి మింగును)

జవా—నడవండి ఠాణాకి, ఈ టక్కుల కేమి (డబ్బీ తీసుకొనును)

హరి—నేనిక జీవించను. నా గర్భశత్రువైన మనోహరుని మరొక్క దెబ్బతో చంపనందుకు విచారిస్తూన్నాను.

(జవానులు తీసికొని పోవుదురు)

చకో—చావు చండాలుడా! నీ పాపానికి మేరలేదు.

(కళ్యాణి, విహారుడు మరికొందరూ వత్తురు)

మనో—పాపము పండితే ఫల మిహలోకమందే లభిస్తుంది. నూరుజంతువులు చంపిన నక్క కొకగాలివాన.

విహా—శాస్త్రి పోలీసుస్టేషనువరకూ పోకుండానే చచ్చినాడట!

ఆనం—మనోహరరావూ, నీ పరిశుద్ధచారిత్రమే వీని పాపమును బైటపెట్టి ప్రాణము తీసింది.

చకో—అంతే కాదు, పుణ్యమునకు పురస్కారము లభింపచేసింది. బ్రతికియున్నవాడు చచ్చినాడు, మృతినొందినవారు బ్రతికినారు.

ఆనం—అ దేలాగు?

చకో—(కళ్యాణి ముసుగు తీసి) ఇప్పు డందరికీ విశదమైనదా?

విహా—హా! తరంగిణి! నా గృహలక్ష్మి! నా పుణ్య

మేమి చెప్పుదును!

తరం—(ఆనందరావు, కళ్యాణి, విహారులకు సమస్కరించును)

సర—అమ్మా! చంద్రికా, నీవల్ల నేను కృతార్థనైతిని. దుష్ప్రవృత్త్యావేశమున ఘోరపాపకూపమున బడనున్న నాశీలమును కాపాడినావు! నిన్ను నేను పెట్టిన బాధలకు నన్ను క్షమింపుము.

చంద్రి—పెద్దదాన వాలా గనకూడదు-నీవు నాయెడ ప్రతికూలముగా నున్నందువల్లనే నాచారిత్రము పరిశుద్ధమైనది-నేను నీయెడ కృతజ్ఞను.

ఆనం—మనోహరరావూ! నీ చారిత్రశుద్ధివల్ల అఘటనఘటనాసమర్థుడవైనావు.

మనో—బంధువులారా! ఈ కపటనాటకమునకు సూత్రధారుడు నా తమ్ముడు. చంద్రికపై వానికిగల ప్రేమయిందుకు ముఖ్యకారణము.

చంద్రి—నాన్నగారూ, పునర్వివాహ మావశ్యకమని మీకిప్పుడు తోచిందా? అన్నా, నీయభిప్రాయ మేమి?

విహా—స్వానుభవము లేనంతకాలము నేను ప్రతికూలుడనై యుంటిని. అనాథశరణాలయము జేరి శాస్త్రపరిశోధన చేసి, వితంతువివాహము శాస్త్రసమ్మతము యుక్తిసంగతము కావడముచేత అవశ్యాచరణీయ మని సిద్ధాంతము చేసుకొంటిని.



సర—గురువరా, నా యపరాధము క్షమించ కోరుతున్నాను. మీ చారిత్రమాహాత్మ్యము పరమపావనము.

ఆనం—పూర్వాచారపరాయణులు సంఘసంస్కారము చేయబూనకపోవడము అత్యంత శోచనీయము. కాలానుసరణముగా పరిస్థితులు మారినవి. వీటి కనుగుణముగా వ్యవస్థలన్నీ మారవలెను. ఇప్పుడుకూడా పూర్వాచారములే ప్రచారములో నుండవలె ననడము సబబు కాదు. ప్రజలలో కదలిక కలిగింది, ఇక నలుగురందులో చేరకపోతే నగుబాటు తప్పదు.

విహా—పూర్వాచారపరాయణు లందరూ పునర్వివాహము యోగ్యమని నమ్ముదురు కాని ఆచరణలో పెట్టడమునకు వారికి ధైర్యము చాలదు. సంస్కారముమాట యెత్తేసరికి మతసమ్మతి లేదని జంకుతారు. శ్రుతులూ స్మృతులూ సంస్కృతమున నుండడమువల్ల జనసామాన్యమున కవి తెలియవు-పండితులు సర్వసాధారణముగా సంస్కారపరాఙ్ముఖులు-వాదప్రతివాదములు సల్పుమంటే మాటలు విరిచి సాజమైన అర్థము చెడగొట్టి తమఅభిప్రాయములకు అనుకూలముగా తిప్పుకొంటారు. సంఘముయొక్క మంచిచెడ్డ లెవరికీ అక్కరలేదు-అంతా అల్లకల్లోలముగా నుంది-ఎవరిష్టము వచ్చినట్లు వారు సంచరిస్తున్నారు-ధనవంతులు, అధికారులూ ఏమి చేసినా వద్దనేవారుండరు, మనబోటివారు చేసినది యుక్తమైనా దాని నావో

దించరు. వ్యక్తులకు వివేకమరుదు, మనోధైర్యము తక్కువ. సంఘమున జిగిలేదు, బహునాయక మవుటచేత దాని లక్ష్య మెవరికీలేదు. ఆదర్శములకూ అభిప్రాయములకూ ఐక్యము లేదు. అభిప్రాయములకూ ఆచరణకూ ఆనుకూల్యములేదు.

ఆనం.—అయితే మనగతేమి?

మనో.—ఈసంఘవిప్లవములో ఆదర్శములను మొదట నేర్పరుచుకొని ఆచారములను నిర్ణయించుకొని వాటిని సర్వజనులామోదించేటట్లు చేయడము అత్యావసరము. వ్యక్తులకు మనోదార్ఢ్య ముండదు కనుక సంస్కార సమాజములను స్థాపించి క్రమక్రమముగా ఒక్కొక్కలోటూ పూటు చేసుకోవలెను.

విహా.—అదేయుక్తమైన మార్గమని నాఅభిప్రాయము. మనోహరరావు స్థాపించిన అనాథశరణాలయము నభివృద్ధిచేసి ముందు వితంతూద్వాహములు చేతాము. నాన్నగారూ, మన చంద్రికకు పునర్వివాహము చేయవలసియున్నది.

ఆనం.—దానికది యిష్టమై యోగ్యుడైన వరుడు చేకూరితే నా యాటంకములేదు

విహా.—దానికిష్టమే. వరుడూ సమీపముననే ఉన్నాడు. చిన్నప్పుడే మీరు నానికి వాగ్రూపమున కన్యాదానము చేసినారు. మన చకోరునికన్న యోగ్యుడు మన ఊరనేకాదు దేశమందులేదు.

ఆనం.—నాకాసంబంధ మంగీకారమే.

---



